శ్రీరామనృసింహ గ్రంథరత్నమాల 6.

శ్రీ

# మహాభారత యుద్ధము

రచయిత:

ఇట్టేంఁ నరసింహమూర్తి

(ఉభయభాషా ప్రవీణ)

ప్రకాశకులు:

శ్రీరామనృసింహ గ్రంథరత్నమాల,

తోలేరు.

**1960**

 వెల రూ. 2/-



రచయిత:

ఇట్టింకి నరసింహమూర్తి

(ఉభయభాషా ప్రవీణ)

# అంకితము

పుత్రవాత్సల్యంబున విద్యాబుద్ధుల గఱపిన గురువరేణ్యులను, అల్లారుముద్దుగఁ బెంచి పెద్దనుగావించి వినయ విధేయ విజ్ఞానంబు లలవరచిన ప్రేమైకస్వరూపులగు జననీజనకులకును, ఆత్మవిద్యావిచారణమునకు దోహదమొసంగిన చిరస్మరణీయులగు సన్మిత్రులను, వైరాగ్యపథమున కవరోధముఁగల్పింపక అర్ధాంగి సహధర్మచారిణీ పదములకు సార్థకతఁగల్పించిన పరమపావనియగు ప్రథమ కళత్రరత్నమును దనలో విలీనముఁగావించుకొని సదా కంటికిరెప్పవలె నన్ను సంరక్షించుచున్నుండు ఏకైక శాశ్వత పరబ్రహ్మస్వరూపమునకు -

## ఆశయము

భారతవిషయపరిజ్ఞానము సామాన్య ప్రజానీకమునకును నందఁజేయుట, వక్తృత్వమున దిట్టలై రాగాలాపనము ససభ్యముగ భావించు నటకులకుఁ బ్రోత్సాహమొసగుట, భావప్రకటనతోఁగూడిన యుపన్యాసధోరణిని ప్రేక్షకుల రంజింపఁజేయుట కవకాశముఁగల్పించుట, దృశ్యకావ్యముగ లేదా శ్రావ్యకావ్యముగ నుపయోగపడఁగల్గుట, విషయగాంభీర్యము సులభముగ వెల్లడియగుటకే వ్యావహారికభాష నుపయోగించుట.

## కృతజ్ఞత

ఈ గ్రంథము నామూలాగ్రముగఁ జదివి దయతోఁ దమ యభిప్రాయముఁ దెలియఁబరచిన విబుధులకు నేను సర్వదా కృతజ్ఞుఁడను.

## హెచ్చరిక

నాలిఖితపూర్వకఅనుమతిపత్రమున్నఁగాని ప్రదర్శించుట, రికార్డింగు చేయుట, భాషాంతరీకరణము, ముద్రించుటకూడదు. వ్యతిరేకించి ప్రవర్తించిన సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులుకావలసివచ్చును. అర్హులని తోచిన ప్రతియొక్కరికి ననుమతిపత్రము సులభముగనే లభించఁగలదు.

తోలేరు
వీరవాసరం పోష్టు.
ప. గో. జిల్లా.

ఇట్టింకి నరసింహమూర్తి
(ఉభయభాషాప్రవీణ)

# పాత్రలు - పరిచయము

1 సూత్రధారుఁడు
2 మారిషుఁడు } కథ నడుపువారు.

3 ధర్మరాజు : అపహృత రాజ్యభాగముగల పాండవ జ్యేష్ఠుఁడు. సామ్యవాది.

4 భీముఁడు : ధర్మజుని జ్యేష్ఠ సోదరుఁడు. బలశాలి, పౌరుషవాది.

5 అర్జునుఁడు : పాండవ మధ్యముఁడు. శ్రీకృష్ణుని మిత్రుఁడు. ధనుర్విద్యా కోవిదుఁడు. మమకారము, మోమోటముఁగల వ్యక్తి, అనుకూలవాది.

6 నకులుఁడు : అన్నలననుసరించి నడచు సౌమ్యహృదయుఁడు, ఋజుత్వవాది.

7 సహదేవుఁడు : పాండవ కనిష్ఠుఁడు. శల్యుని మేనల్లుఁడు, అల్లుఁడు. యథార్థవాది.

8 ద్రౌపది : పాండవ పత్ని. పాంచాలదేశపురాజగు ద్రుపదుని కుమార్తె. వీరవనిత, వీరపత్ని, వీరమాత.

9 శ్రీకృష్ణుఁడు : సర్వతోముఖ ప్రజ్ఞగల మేధావి. రాయబారి. మధ్యవర్తి. సంస్కర్త. అభ్యుదయవాది.

10 సాత్యకి : శ్రీకృష్ణుని సోదరుఁడు. అర్జునుని శిష్యుఁడు. రాయబారియగు శ్రీకృష్ణునకు అంగరక్షకుఁడు.

11 ధృతరాష్ట్రుఁడు : కౌరవరాజు. అంధుఁడు. కురుకుమారుల తండ్రి. పాండుకుమారుల పెదతండ్రి. పుత్రపక్షపాతి.

12 విదురుఁడు : మంత్రి. ధృతరాష్ట్రుని సోదరుఁడు. పాండవపక్షపాతి.

13 భీష్ముఁడు : కురువృద్ధుఁడు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడు. ధర్మపక్షపాతి.

14 ద్రోణుఁడు : ధనుర్విద్యాగురువు. ద్రుపదుని విరోధి. అర్జున పక్షపాతి

15 దుర్యోధనుఁడు : యువరాజు. రారాజు. ధృతరాష్ట్రుని జ్యేష్ఠ పుత్రుఁడు. రాజసము ప్రధానముగాఁగల వ్యక్తి.

16 కర్ణుఁడు : దుర్యోధనుని ప్రాణమిత్రుఁడు. దాత. మొదట కౌంతేయుఁడు పిదప రాధేయుఁడు. అర్జునునకు సరితూగు ధనుర్విద్యాకోవిదుఁడు.

17 కృతవర్మ : శ్రీకృష్ణుని రాజ్యములోని కంసుని కుటుంబమగు భోజకుటుంబమునకుఁజెందిన సామంతరాజు శ్రీకృష్ణునకు దగ్గఱిబంధువైనను శ్రీకృష్ణునియందు,యదుకుటుంబమందుఁగల యీర్ష్యచే నక్షౌహిణీ సైన్యముతో కౌరవపక్షమునఁజేరిన వ్యక్తి.

18 సంజయుఁడు : కౌరవమంత్రి. టెలివిజన్, రేడియో సాంకేతికములచే యుద్ధ విషయములఁదెలిసికొని యెప్పటికప్పుడు అంధుఁడగు ధృతరాష్ట్రునకుఁ దెలుపనియమింపఁబడిన ఋజుత్వముగల వ్యక్తి.

# అభిప్రాయము

శ్రీ ఇట్టింకి నరసింహామూర్తిగారిచే రచింపఁబడిన 'మహాభారత యుద్ధము' అను గ్రంథమును జదివితి. వీరు 'శ్రీమదాంధ్రభాగవతము' (ఆంధ్రానువాద పద్య కావ్యము) 3100 సంస్కృతానువాద శ్లోకములుగల వేదగీతా ప్రథమ సహస్రిక ఇంకను ననేక సంస్కృతాంధ్ర స్వతంత్ర అనువాద గ్రంథములు రచించిన కళావభాసులు, ఉభయభాషా ప్రవీణులు, శ్రీ గద్వాల సంస్థానాస్థాన కవులు నగు శ్రీరామనృసింహమూర్తి కవులలో నొకరు. వీరొక్కరే యీ గ్రంథమును వ్యావహారిక భాషను సరళవచన రచనగ నాధునిక పద్ధతులలో రచించుటఁజూడ నీక్రింది విషయము లూహింపఁబడుచున్నవి.

వేదగీతా భాగవతాది సంస్కృతాంధ్ర గ్రంథములు రచించినవారగుట ప్రాచీనగ్రంథములయందలి నిగూఢతత్త్వము వెల్లడింపఁగుతూహలముఁగల్గియు దానిని సలక్షణగ్రాంథిక శైలి పద్యకావ్యములతోఁగాని, సంస్కృత కావ్యములతోఁగాని సామాన్యప్రజల రంజింపఁజేయఁజాలక పోవుచుంటిమి కదా, అను ఆవేదన, అటుల రంజింపఁజేయ చవుకబారు సాహిత్యముపయోగించిన తమ ప్రతిభకు భంగపాటు కల్గునను భీతియుఁగలిగి జంటకవులగు శ్రీరామ నృసింహమూర్తి కవుల సుప్రసిద్ధ సాహిత్యప్రతిభకు భంగపాటుకలుగని పద్ధతిని సామాన్యప్రజలకు మహాభారత విషయములు వెల్లడించుటకుఁగాను నీ గ్రంథము తామొక్కరే రచించుట శ్రీ నృసింహమూర్తిగారి యుద్దేశ్యమై యుండవచ్చు. ఇంకను చౌకబారు సాహిత్యము నకు కుత్తుకారు జనమును ప్రోత్సహించుటయు నైయుద్దేశ్యమును వెల్లడించుచున్నది.

మన కష్టసుఖముల నితరులతో నావేదనతో నెన్నిగంటలకాలము ముచ్చటించుకొన్నను మనమది వల్లించిన పాఠమైయుండనట్లే ప్రదర్శించుటకును వల్లించ నక్కరలేకుండ విషయముగ్రహించి యుపన్యసించు భావయుత గంభీర వాగ్ధోరణి కల నటులకిది యెంత సులభమో మిగిలినవారికంత కష్టతమమును కాకపోదు. ధర్మరాజు, శ్రీకృష్ణుఁడు, భీష్ముఁడు ఇట్టి పవిత్ర పాత్రలచే మానవలోకమును విజ్ఞాన శోభితముఁగావించి పరివర్తనఁజెందింపఁదగిన సంస్కారణపూర్వక సంభాషణలు పలికించుటవలన కవి ప్రతిభయు విశేషించి వెల్లడియగుచున్నది.

మహాభారత కథయందలి సందేహములు తీరుట, వేదాంత రహస్యమంతయు కరతలామలకమగుట, ప్రేక్షకులకు, శ్రోతలకు స్వల్పవ్యవధిలో ననేక విషయములు సుబోధకమగుట, నటకులకు వక్తృత్వములలవడుట, ప్రాచీనమున నాధునికముఁజొను ఫుట్టుకలన నాటకపోటీలకును సహకరించుట, శాంతియుద్ధముల సంగతి తెలియుట మొదలగు నెన్నియో ప్రయోజనము లీగ్రంథమువలనఁ గలుగుననుట అతిశయోక్తి కానేరదు. వ్యాసునకు 18 సంఖ్య హితవు. ఇందునను 18 పాత్రలసంఖ్య దాని ప్రాధాన్యమును సూచించుచున్నది. ఇట్టి పవిత్ర గ్రంథకర్తలగు శ్రీ ఇట్టింకి నరసింహమూర్తిగారికి భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యములనిచ్చి రక్షించుఁగాక!

K. శ్రీరామమూర్తి B. A.



# మహాభారతయుద్ధము

## ప్రథమాంకము

## నాంది

గీ॥ శిష్టసంరక్షకుఁడు దుష్టశిక్షకుండు
ఆశ్రితావనుఁడైన నారాయణుండు
శాంతినొసగూర్చి సర్వత్రసౌఖ్యమొసఁగ
లోకకల్యాణదాయి యౌఁగాక యెపుడు.

(నాంద్యంతమున తెరనుంచి చెఱియొక్కవైపున మారిషసూత్రధారులు ప్రవేశింతురు)

మారి : బావగారూ! ఏమిటీ హడావిడి ?

సూత్ర : అబ్బే. ఏమియునులేదు. మానవప్రకృతి శాంతిని గోరుదానివలె కనబడుటతప్ప దానికి యుద్ధమే చాల యిష్టమునుమండీ. అందువల్ల యుద్ధములలో చాల గొప్పదియగు మహాభారతయుద్ధము నాటకమాడుమన దాని సరంజామాలో తిరుగుచున్నాను. అంతకంటే మరేమియును లేదు.

మారి : బావగారూ! భారతయుద్ధ మంతగొప్పదేమిటండీ ?

సూత్ర : గొప్పదా, అని నెమ్మదిగానడుగుచున్నారేమి ? అప్పటి భరతఖండము యిప్పటి హిందూదేశము మాత్రమే కాదుసుమండీ. ఉత్తరమున తిబేత్తు, అంటే పూర్వము త్రివిష్టపము (స్వర్గము) అట్టి తిబేత్తులోనివగు ఉత్తరకురు, కాంభోజ, ఉలూక దేశములు. తూర్పున చైనా, అస్సాం దేశములలోనివగు ప్రాగ్జ్యోతిషాదులు. పడమర మధ్యాసియా, ఆఫ్ఘనిస్థానములలోనివగు ఉశీనర, మద్ర, బాహ్లీక దేశములు. దక్షిణమున సింహళము వరకు భరతదేశమే సుమండీ. అందు కురుక్షేత్రమను ప్రదేశమున నీబ్రహ్మాండమగు యుద్ధము జరిగినదండీ.

మారి : బావగారూ! ఆ ప్రదేశమున నీయుద్ధము నిజముగ అంటే (చారిత్రాత్మకముగ) జరిగినదంటారా ? లేక వేదాంతోపన్యాసములకు పురాణకథలకు నుపయోగపడులాగున కల్పింప బడినదంటారా?

సూత్ర : అదేమిటండీ, ఆలాగంటారు? నిజముగ జరిగేయుంటుందనటానికి మనకొక్క నిదర్శనము కనబడుచున్నది చూడండి. ఆ ప్రదేశమున కేకుజదృష్టి దోషమున్నదో కానండీ యీనాటికిని అక్కడ రక్తప్రవాహ మప్పుడప్పుడు ప్రవహించుచుండుట చూడడం వినడం జరుగుటలేదటండీ ?

మారి : ఏమి బావగారూ! తరువాతకూడ ఆ ప్రదేశమున యుద్ధాలు జరిగినవేమిటండీ ?

సూత్ర : ఏమిటండీ. చదువుకొన్నవారుకూడ యీలాగు చిత్రముగా నడుగుచున్నారు ? వినండి మఱి చెబుతా. క్రీస్తుశకము 1122 సం.లో పానిపట్టువద్ద పృధ్వీరాజు మహమ్మద్ గోరీలకు, 1526 లో స్థానేశ్వరమువద్ద బాబరు, ఇబ్రహీంలోడీలకు, 1761 లో పానిపట్టువద్ద మహారాష్ట్రులకు నహమ్మదు అబ్దాలీలకు జరిగిన యుద్ధాలలో నెంత ప్రజాక్షయము ఎంత రక్తపాతము జరిగినదండీ.

మారి : బావగారూ! కోపగించుకొనకండీ ఒక్కటడుగుతా. అసలీ ప్రజాక్షయకరమగు యుద్ధముజరిగిన కురుదేశ మెక్కడనుంచి యెక్కడవర కంటారు ?

సూత్ర : బాగాఅడిగారు. చెబుతావినండి. ఉత్తరమున హిమాలయము, తూర్పున పాంచాల దేశములోనివగు అహిచ్ఛత్రము మాకంది కాంపిల్యములు, దక్షిణమున మధ్యదేశము (అప్పటి మరుస్థలము. ఈనాటి రాజపుత్రపు యెడారి) పశ్చిమమున గాంధారదేశము (నేటి కాంధార్) యింకా నేటి పశ్చిమోత్తరపరగణాలు, పంజాబు మొదలగు సరిహద్దులుకలది కురుదేశమండీ.

మారి : బావగారూ ! ఒక్కటడగడం మరచిపోయినాను. భరతదేశపు ఎల్లలు. కురుదేశపు సరిహద్దులు మనవిచేసారుకాని కురుక్షేత్రపు పొలిమేరలుకూడ దానితోపాటు మనవిచేసారుకాదు. అదికూడ మనవిచేస్తారా ?

సూత్ర : దానికేమండీ వినండి చెబుతా. నేటి యలహాబాదు మొదలు రమారమి రాజపుత్రస్థానపు ఎడారివరకు యుద్ధప్రదేశమేసుమండీ. వారణావతము, అహిచ్ఛత్రము, పంచనదము, కురుజాంగలము, రోహితకారణ్యము, కాలకూటము, గంగాకూలము మొదలగు ప్రదేశములలో సైన్యములు సమకూర్చబడినట్లును, ఆప్రదేశము సుమారైదు వందల మైళ్ళనియు ఉద్యోగపర్వము 18వ అధ్యాయములో వ్యాస మహర్షి చెప్పినాడుకదండీ. అదియునుంగాక సైంధవ వధనాడు సైంధవుని రక్షించుకొనుటకుగాను కౌరవులును, సైంధవునిసంహరించుటకుగాను అర్జునునకు బాసటగ పాండవులును సమాయత్తపరచిన సైన్యవ్యూహములు అడుగెడమ లేకుండ పంద్రెండు యోజనములవైశాల్యమని యీవ్యాసుడే విశదపరిచాడుకాదండీ.

మారి : సరే బావగారూ! బాగానేయున్నదికానండీ ఎప్పుడీ పాత పురాణ కథలేనటండీ ఆడడం. క్రొత్తవేవైన ఆడకూడదటండీ.

సూత్ర : మానవుడంటే యేమిటో తెలిసికున్నారా ? మా-నవ, క్రొత్త యేమీ లేదనికాదటండీ. ఎప్పుడూ మానవతత్త్వాలొకటే. ఎప్పుడూ యుండే యీమానవతత్త్వాలే మహర్షులు పురాణకథలలో నిమిడ్చారు. ఏనాటి కవులానాడే దానిలో నాధునిక విషయములు చూపించుచుఁ దమకాలపుపరిస్థితులను గుర్తింపఁజేయాలండీ. అవే యుత్తమగ్రంథాలు. ఇప్పుడీయాడబడే నాటకములోనివి పాత పాత్రలైనను సరిక్రొత్తపోకడలండీ.

మారి : ఈనాటకమాపాకమునసే పడినదికాదండీ !

సూత్ర : ఏమిటండీ అలాగడుగుతారు చిత్రింగా. ఏలాగుపడ్డదో మీకే తెలి యునుకదా. తినబోతూ రుచియడుగుట ఎందులకండీ ? యుద్ధా తేలాగున బయలుదేరునో మానవుఁడెటుల భ్రష్టుడగుచున్నాడో. అసలు మానవతత్త్వ మెటువంటిదో యింకను యిప్పుడు ప్రబలి యున్న నియంతృత్వము, ప్రచ్ఛన్ననియంతృత్వము, ప్రజాస్వామి కము దానియాభాసము, సామ్యవాదము, ప్రగతివాదము, పలా యనవాదము, భూస్వామ్యసంస్కరణలు, భాగ్యవాదము, సామ్రా జ్యవాదము మొదలగు యావత్తు ఆధునిక రాచకీయపరిస్థితులు బాగుగా పరిశీలనచేసి రెండు ప్రపంచయుద్ధముల పరిణామము అవ గతముఁజేసికొని కమ్యూనిజము, కేప్టలిజము పేద, ధనిక, సామాజికముల కేతుణమున యుద్ధమారంభింపఁబడునో యని యాందోళనలు బయలుదేరు నీసమయమున ప్రజాసముదాయ మున కీయుద్ధశాంతుల బలాబలములు తెలుపుటమూలముగ మానవ హృదయముల నైర్మల్యము స్థాపించుటకుగాను చెవికింపగు భాష తో మనస్సునకు సూటిగ తగులు భావముతో నిటీవలనే యిది రచింపఁబడినదండీ.

బావగారూ ! ఒక్క చిన్నమాట. పెద్దపెద్ద రాగములతో ప్రేక్షకుల నవ్యక్తమాధుర్యరసవాహినుల ముంచుచున్నారీనాటి వరకు న ట కు లు. వ్యక్తవిజ్ఞానమాధుర్యము, దీర్ఘోపన్యాస పద్ధతి కల వక్తృత్వము, వచనశైలినిచూపుట నటకులకు, వినుట ప్రేక్షకులగు శ్రోతలకును కష్టము. సంక్షిప్తవిషయము వచనకవి త్వము. విపులముగవివరించుట వక్తృత్వము. ఇదియొక యాధునిక పద్ధతి గద్యరచనండీ.

మారి : బావగారూ! మఱొక్కమాట. శృంగారము, కరుణ, శాంతిరసము లతో కూడిన దృశ్యముల వీక్షించుట, ఆనందదాయకము కాని వీరము, రౌద్రము, భీభత్సము, భయానక దృశ్యములతోకూడి

ప్రజాక్షయ రక్త ప్రవాహాదులతో కూడిన యుద్ధవీక్షణవలన నానంద మేమి కలుగునండీ. శాంతి, సంధివిడనాడి యుద్ధములఁగాంక్షించుట యవివేకము కాదటండీ.

(తెరలో)

భరతపుత్రా! శైలూషాధమా! నీవును నటులనే యను చున్నావా? కూటికి, గుడ్డకు మోమువాచి యన్నమో రామ చంద్రా యని సాటిమానవులడలుచుండ వారి గోడుశినక తెగతిని బొజ్జలు పెంచుకొనుచు నాపసోపాలుపడు బొజ్జబాబులుండ ఆ బీదల జఠరాగ్ని యుద్ధప్రళయాగ్ని కాకుండ నెటుల నిలువగలదు? దాని నెవఁడాపుచేయఁగలడు?

సూత్ర : బావగారూ! పొరబడ్డాం. అదిగో అప్పుడే పాండవులు సమావేశ పడుట, శ్రీకృష్ణుని సంధిరాయబారిగ కౌరవసభకు పంపదలఁచుట, భీముఁడు దానికడ్డుతగులుట జరుగుచున్నది. విన్నారుకదూ? ఇఁక మన మిచటనుండి యేపొరపాటుమాట మాటాడినను ఆ వేష ధారి భీముఁడును మనపై విరుచుకుపడఁగలడు. రఁడి పోదాం.

(మరల తెరలో)

అర్జు : అన్నా! భీమసేనా! శాంతింపుము. అన్నగారేదియో శ్రీకృష్ణ భగవానునితోఁజెప్పుచుండ మనమడ్డుతగులుట భావ్యమగునా?

భీము : అర్జునా! మనమందఱము పరోక్షమున వినుచుందము. ప్రత్యక్ష మునసైన యడ్డుతగులవలసి యేవచ్చును.

అర్జు : సరే!

సూత్ర : (వినుటనభినయించి) అది భీమార్జునుల సంవాదమైయుండవచ్చు బావగారూ! రండి మనం పోదాం. (అని నిష్క్రమింతురు)

ప్రస్తావన.



# మహాభారత యుద్ధము

## ప్రథమాంకము (పాండవ సందేశము)

పరిషమద్భశ్యము. స్థలము ఉపప్లావ్యము.

(ధర్మరాజ శ్రీకృష్ణుల ప్రవేశము)

ధర్మ : మాధవా! చంద్రవంశసంజాతుఁడగు యయాతికి శర్మిష్ఠయందు పుట్టిన పెద్దకొడుకు యదువు. చిన్నకొడుకుపూరుఁడు. యయాతి మాట తిరస్కరించినందున యదువంశస్థులకు రాజ్యము లేకపోయినది. తండ్రి వృద్ధాప్యము తీసికొని తనయౌవనమిచ్చుటకంగీకరించినందున పూరువంశస్థులకు రాజ్యము సంక్రమించినది. ఆ యదువంశసంజాతులగు యాదవులుమీరు. పూరువంశసంజాతులగు పౌరులము మేము. మా పూరువంశమున దేవాపి, బాహ్లికుఁడు, శంతనుఁడు ముగ్గురన్నదమ్ములు. దేవాపి ఆధ్యాత్మికచింతచే రాజ్యము త్యజించి యడవికి తపస్సునకుపోయెను. బాహ్లికుఁడు మా పూరురాజ్యమున తాను కొంతభాగము తీసికొని తాను వేరే పరిపాలించుకొనుచుండెను. అదే బాహ్లికదేశము. బాహ్లికుని కొడుకు సోమదత్తుఁడు. సోమదత్తుని కొడుకు భూరిశ్రవుఁడు. ఆరాజ్యభాగమునే పాలించుకొనుచు నప్పుడప్పుడు ప్రధాన కుటుంబమునకు యుద్ధముల సాయపడుచుండిరి. ఇఁక శంతనునకు గంగాదేవియందు మా తాత భీష్ముఁడును, సత్యవతీదేవియందు చిత్రాంగద విచిత్రవీర్యులును జన్మించిరి. సత్యవతీ వివాహసందర్భమున భీష్ముడు బ్రహ్మచర్యవ్రత మ్మవలంబించుటకు ప్రతిజ్ఞచేసి సంతతిలేనివాఁడాయెను. చిత్రాంగదుఁడు వివాహము కాకుండగనే గతించెను. భీష్ముఁడే

కాశీరాజకుమార్తెలగు అంబిక,అంబాలికలను రాక్షసవివాహమున గొనితెచ్చి విచిత్రవీర్యునకు వివాహముగావించెను. సంతతి కలుగకుండ విచిత్రవీర్యుఁడును చనిపోయెను. భీష్ముఁడు వంశవిచ్ఛేదకమునకు చింతించి పినతల్లియగు సత్యవతీదేవితో యోచించి యామె పెద్దకొడుకగు వ్యాసునివలన దేవరన్యాయంబున అంబికయందు సంతానము కల్గించుటకు కృతనిశ్చయుఁడయ్యెను. మాతృనియోగమున నంబికయందు వ్యాసుఁడు కుమారునిగాంచెనుకాని యాకుమారుఁడు మాతృదోషమున పుట్టుగ్రుడ్డి యాయెను. అతఁడే మా పెదతండ్రియగు ధృతరాష్ట్రుఁడు. అంధుఁడు రాజ్యానర్హుఁడగుట సత్యవతీ భీష్ములు మఱల నంబాలికయందు సంతానము గల్గింప వ్యాసుని నియమించిరి. అంబాలికయందును కుమారుఁడు జన్మించెను కాని మాతృదోషమున నాతఁడు రాజయక్ష్మరోగము కలవాఁడయ్యెను. అతఁడే మా తండ్రి పాండురాజు. అతఁడును రోగకారణమున రాజ్యానర్హుఁడగుట మఱల సత్యవతీ భీష్ములు అంబికయందే మఱొకసుతుని గాంచుటకు వ్యాసుని ప్రార్థించి యంబికను కుదుఱుపఱచిరి. కాని యామె భీతచిత్తురాలై రహస్యమున నాకృత్యమునకు దాసిని నియమించెను. మాతృనియోగము, కాలప్రభావము గడువజాలక వ్యాసుఁడా దాసియందు కొమరుని గాంచెను. అతడే విదురుఁడు. ఈ ముప్వురు పుత్రులును న్యాయశాస్త్రరీత్యా రాజ్యానర్హులగుట నాశాస్త్రమున నొక నూతనసూత్రము మా తాత భీష్ముఁడు, వ్యాసుఁడు మొదలగు పెద్దలు పొందుపరచిరి. అదియేమన ? జన్మాంధుడగు ధృతరాష్ట్రుఁడు సింహాసనం బధిష్ఠించుటకును, మా తండ్రియగు పాండురాజు దండనాథుఁడై రాజ్యము విస్తరింపజేయుటకును,విదురుఁడు మహామంత్రిగా రాచకార్యములు చక్కబెట్టుటకును యేర్పాట్లు గావించి ధృతరాష్ట్రపాండురాజులకు పుట్టు పుత్రులలో నెవఁడు

పెద్దవాఁడో వానికి యువరాజపట్టాభిషేకము గావించుటకును, నింతటినుంచి రాజ్యము జ్యేష్ఠక్రమానుగతముగాక అన్నదమ్ముల బిడ్డలలో నెవఁడు పెద్దవాఁడైన వానికి రాజ్యము సంక్రమించుటకును నిర్ణయముగావించిరి. పిమ్మట మా తాత భీష్ముఁడు పూరువంశ మభివృద్ధిచెందవలెనని నూర్వురు కుమారులు పుట్టుదురని జాతకము వ్రాయఁబడిన గాంధారదేశపు రాకుమార్తె గాంధారిని మా పెదతండ్రి ధృతరాష్ట్రునకును, కుంతిభోజుని పెంపుడుకూతురును, మీ మేనత్తయునగు కుంతీదేవిని దూర్వాసునిమంత్ర ప్రభావమున దేవతానుగ్రహమున సంతానము గాంచగలదనే విశ్వాసమున కుటుంబాభివృద్ధికై మా తండ్రి పాండురాజునకును వివాహములుగావించెను. తదుపరిమాతండ్రి మాద్రినివివాహమాడెను. మా పెదతల్లి గాంధారి గర్భవతియగు సమయమున మా తండ్రి పాండురాజు కుంతీమాద్రులతో వనమునకు విహారార్థముచని యచట పొరపాటున కవగూడు మృగమిథునమును బాణమున కొట్టి తరువాత చూచి పశ్చాత్తాపముఁజెంది మనోవికలత్వంబున శారీరిక వ్యాధిగ్రస్తంబున బ్రహ్మచర్యమవలంబించెను. అప్పుడు మా తండ్రి యాజ్ఞచే పరమ పతివ్రతాతిలకమగు మా తల్లి కుంతీదేవి దూర్వాసునిమంత్రప్రభావమున యమ, అనిల, ఇంద్రుల నాహ్వానించి నన్ను, నీభీమార్జునులను గాంచెను. ఆ మంత్రమే మా పినతల్లి మాద్రికిని నుపదేశింప నామె యశ్వినీదేవతలయంశచే నీ సుకుమారాకారులగు నకులసహదేవులఁగాంచె. మా తండ్రి పాండురాజు బ్రహ్మచర్యవ్రతభంగమున వ్యాధిగ్రస్తంబున మరణించెను. మా తల్లి కుంతి మమ్ములఁబెంచుటకును, పినతల్లి మాద్రి భర్తతో సహగమనము చేయుటకును నిర్ణయించుకొనిరట. మాద్రియు గతించెను. ఏనాఁడు నేను కుంతీగర్భమున యమానుగ్రహమున జన్మించితినని మా పెదతల్లిచెవులఁబడెనో ఆమె ప్రసవింపకుండుటకు

కంగారుపడి న్యాయశాస్త్ర సూత్రరీత్యా అన్నదమ్ములబిడ్డలలో పెద్దవాఁడనైన నాకే రాజ్యము సంక్రమించునని గర్భపాతముఁగావించుకొనెను. ఒక మాంసపేశము పడెను. ఆయకృత్యమునకు కటకటపడి మా తాత భీష్ముఁడా పేశమున నూఱు పొరలుండుట గ్రహించి వ్యాసాది వైద్యశాస్త్రప్రవీణ మహర్షుల సహాయమున నా నూఱు భాగములు నూఱు నేతికుండలయందుంచి భద్రముగ పొదిగించెను. మఱొక చిన్న భాగమును నశ్లేచేసిరి. మాభీముఁడు జన్మించుతరుణమున సందొక కుండ నుంచి యొక మగశిశువు జనించెను. అతఁడేదుర్యోధనుఁడు. అక్కడనుంచి యొక్కొక్కఁడుగా దుశ్శాసనాదులు తొంబది తొమ్మండుగురు పుత్రులును, దుస్సల యనుపుత్రికయు జనించిరి. మహర్షులచే పురికి తీసికొని రాబడిన మమ్ములను తన కుమారులతోపాటు మా పెదతండ్రి ధృతరాష్ట్రుఁడే పోషించెను. తండ్రి లేనివారమగుట పెద్దలందఱు మమ్మొక్కువగారాబమునఁ జూడసాగిరి. కాని దుర్యోధనాదులు మాత్రము తల్లి గాంధారి యసూయామనోవైకల్యముల జనించినవారగుట వీరును నసూయాగ్రస్తులై బాల్యమునుండియు మమ్ముల వేధింపఁదొడగియు, దైవానుగ్రహము కలవారమగుట మమ్మేమియుఁ జేయఁజాలకపోయిరి. భీష్ముఁడు మొదలగు పెద్దలుమాత్రము శాస్త్రసమ్మతముగా నాకే యువరాజ పట్టాభిషేకముఁ గావించిరి. దాన మఱింత దుర్భావముకలిగి తమకు రాజ్యమిఁక సంక్రమించదని తండ్రిని స్వాధీనముచేసికొని మమ్ముల మట్టుబెట్ట వారణావతము పంపుట, లాక్షాగృహదహనము మొదలగు దుస్తంత్రములు పన్నిరి. అవిగడచి మఱల మేము ద్రౌపదీస్వయంవర సమయమున బహిర్గతులమగుటయు, ప్రబలుఁడగు పాంచాలరాజు ద్రుపదునితో సంబంధ మేర్పడుటయు వారికిమఱింత యసూయ మఱల పెరిగినది. భీష్మాది పెద్దలు కురుపాంచాల దేశములకుగల పూర్వపు వైరము పెచ్చు పెరిగిపోవునేమోయని తత్కాలపరిస్థితుల కనుగుణముగ రాజ్యము చెరిసగము పంచి హస్తినాపురము రాజధానిగా కౌరవుల యర్ధరాజ్యము

కౌరవులు పాలించుకొనుటకును, ఇంద్రప్రస్థపురము రాజధానిగ మా యర్ధరాజ్యము మేము పరిపాలించుకొనుటకును నేర్పాటులు గావించిరి. ఇది నీకును దెలిసిన విషయమే. రాజ్యము మా సంతతికి రావలసిన దైనను పెద్దలుచెప్పుటచే నర్ధరాజ్యమునకే యంగీకరించి దిగ్విజయముచేసి రాజ్యము విస్తరింపఁజేసి రాజసూయయాగము పితృసేవతాప్రీత్యర్థము గావించితిమి. వెనుకటి న్యాయసూత్రము ననుసరించిచేసే మా యన్న దమ్ములకుమారులలోఁ బెద్దవాఁడును, మీ మేనల్లుఁడును, సర్జునపుత్రుండు నునగు యభిమన్యునకే యువరాజ పట్టాభిషేకముఁ గావించుటకు నిర్ణ యించుకొంటిమి. దుర్యోధనాదులు మా రాజ్యాభివృద్ధికి, రాజసూయ యాగమునకు నసూయచెందినవారునై వైష్ణవయాగమను నొకదానిని కల్పించి మమ్ముల నచ్చటి కాహ్వానించిరి. అచ్చటి సుహృద్ద్యూతమున నాతో నాడుటకు శకునిని నియమించిరి. మాకును జూదమునందు నేర్పు కలదు. సుహృద్ద్యూతమున కంగీకరింపకుండుట క్షత్రియధర్మవిరుద్ధముకాన నంగీకరించితిమి. అదేమి మోసమో యిప్పటికిని మాకు తెలియలేదు. ఆ పాచికలు నేను వేసినను శకునివేసినను నవి నాపాచికలైనను వాని పాచి కలైనను జయాపజయములు శకుని యిష్టమునుబట్టి పడుచుండెవి. ఏదైన నొడ్డి యా చిత్రమును గ్రహింపవలెనని రయే ప్రయత్నించితిమి. కాని పణ ముగానొడ్డి సర్వంబును గోల్పోయితిమి. కృష్ణా! మేమోడినపిమ్మట తప్పో మఱియొప్పో ద్రౌపదినిగూడ పణముగానొడ్డి గోల్పోయితిమి. రాజ్యభ్రష్టులమైతిమి. సేవకులమైతిమి. ధర్మంబునకు కట్టుబడితిమి. రాజ లాంఛనములగు దుస్తులఁదీసివేసితిమి. పాంచాలి మాత్రము తామోడిన పిమ్మట భర్తలు తనొడ్డుటకు హక్కులేదనియు, రజస్వల యేకవస్త్రి యగుట దుస్తుల మార్చుటకు వీలులేదనియు, నీజూదమునందేదో మోస మున్నదికానచెల్లుటకువీలులేదనియు వాదించెను. కానియాకౌరవులు మా యందలి యీసున, ద్రుపదునియందలి ద్వేషమున మయసభలో ద్రౌపది యేదియో తన్నవమానించెనను సెపమున వారలకూళతనమున మూర్ఖుఁ

డగు దుశ్శాసనునిచే కేశగ్రహణ, వస్త్రాపహరణాదులు గావింపఁజేసిరి. మేము ధర్మమునకు కట్టుబడిన వారమగుట నాధర్మదేవత ద్రౌపదిని గాపాడినది. కౌరవులకోరిక యీడేరలేదు. గగ్గోలము కలిగినది. ధృతరాష్ట్రుఁడు జరిగినదంతయు రద్దుపరచి కొడుకులనుందలించి మా రాజ్యము మాకొసంగి మమ్ములఁబంపివేసెను. కౌరవులెట్లైన మారాజ్యమపహరించి మమ్ముల కష్టములపాలు చేయవలెననియే తలంచుచుండిరి. మేమును స్త్రీమూలమున రాఁబడిన రాజ్యమునకు గర్వించుకొనుచు శకుని జూద మందలి చిత్రమును గ్రహించుటకు నాతృతఁ జెందుచుంటిమి. ఈ యూహయే రాజ్యముమీదఁగాక పండ్రెండుసంవత్సరములరణ్యావాసము, నొక సంవత్సర మజ్ఞాతవాసము-నందుఁ దెలియఁబడిన మఱల నట్లేచేయుట పణముగా ముందు నా పాచికలతో నేనే ముందెత్తుగా వేయు నియమముగా ననుద్యూతము జరిగినది. అందునను మేమే యోడితిమి. కృష్ణా! నీవప్పుడు సాల్వాది ప్రబలశత్రువులతో యుద్ధములు గావించు చున్నావు. నీవున్న నింతవరకు రాకుండునేమో! మేమావిధమున సమ యము నిర్వర్తించి యధికముగగాక యోడని మాయర్ధ రాజ్యము మాత్రము మాకిమ్మనుచుంటిమి. ద్రుపదపురోహితుని రాయబారిగ పంపి తిమి. దానికి వారడ్డదిడ్డముగాబల్కి శుష్కప్రియములు శూన్యహస్తము లతో సంజయుని పంపిరికదా? నేను ప్రజానాశనకరమగు నీ యుద్ధమున కేలకారకుఁడనుకావలెనని యర్ధరాజ్యముకాని, యైదూళ్లుకాని యిమ్మని కోరితిని. కాని సంజయుఁడు వారలుచెప్పిరో తానసనెనో కాని "ధర్మ రాజా! యీ యిచ్చుటలు పుచ్చుకొనుటలెందులకు? వారేమియునీయరు. నీవును యుద్ధముచేసి జననాశనము కుటుంబనాశనముఁగావించి రాజ్యము పుచ్చుకొనినను నేమిలాభము? రక్తాన్నముకంటె భిక్షాన్నము మేలు" అన్నాడుకదా! ఇప్పుడు మనము యుద్ధము చేయుటా? మానుటా? ఙ్ఞాధ్యుఁడవైన నీవొక్కపరి యచటికరిగి యచ్చటి నిజానిజము లెఱిగి వచ్చుట మంచిదా? చెడ్డదా? ఇది విషయనిర్ణయ సభ. ఈ నామాటే

సిద్ధాంతముకాదు. మీ యభిప్రాయములు తెలియునంతవరకు నా యుప న్యాససారాంశమేమన ? సంధి కుదుర్చుటకుగాను నీవొకపరి కౌరవసభకు వెళ్ళివచ్చుటయే మంచిపనియని తోచుచున్నది.

(భీముని ప్రవేశము)

కృష్ణ : బావా! వాయునందనా ! నీయభిప్రాయమేమి ?

భీము : కృష్ణా ! ఇతివృత్తసూచనకు నన్నగారిమాటలు నాంది. మీయందరి మాటలకు సందర్భము కల్గించుటయే నా ప్రస్తావన. అంతే కాని నాదియు సిద్ధాంతముకాదు. పెరుగుచున్న రోగమును, పెరుగుచున్న శత్రువును నుపేక్షించఁగూడదు. ధూళినిబురదగా క్రిందకు నణగద్రొక్కిన కాని నీటికి నిర్మలత్వమురాదు. కంటకుల నాశనముచేసినకాని శాంతి యేర్పడదు. కాన నీవిషయమున సంధిపనికిరాదనియే నా నిశ్చితాభి ప్రాయము. కృత్రిమశత్రువు, సహజశత్రువు, ప్రాకృతశత్రువు, అనిశత్రు వులు మూఁడు విధములు. ఇట్లే మిత్రుఁడును మూఁడు విధములు. తాత్కాలికయుపకారి కృత్రిమమిత్రుఁడు, తాత్కాలికయపకారి కృత్రిమ శత్రువు. పినతల్లి, పెదతల్లి పుత్రులు సహజమిత్రులు. పినతండ్రి, పెద తండ్రి పుత్రులు (దాయాదులు) సహజశత్రువులు. సరిహద్దునకవతలవ్యక్తి ప్రాకృతమిత్రుఁడు, సరిహద్దువ్యక్తి ప్రాకృత శత్రువు. ఈ కృత్రిమ, ప్రాకృత శత్రువులపట్ల సంధి యుచితమేమోకాని సహజ శత్రువులగు దాయాదులయెడ సంధివాక్యము లనుపయోగములు. సహజవైరముకల పిల్లి యెలుకలకు, సింహగజములకు, శ్యేన కపోతములకు రాయబారము లచే సంధి కుదర్పగలరా ? శత్రు వభివృద్ధి నొందుచుండ తానుమాత్రము సుఖింపఁదలఁచినవాఁడు గడ్డిమేటి మండుచుండ, గాలికి దిగువ నిదురింప దలఁచినయట్టివాఁడు కాదా ! గోవు మొదలగు జాతిశబ్దములు, వచ్చుట, పోవుట మొదలగు క్రియాశబ్దములు, తెలుపు, నలుపు మొదలగు గుణ శబ్దములునుండ ప్రౌఢకవుల ప్రయోగములందలి యిత్థ, డవిత్థ మొదలగు కేవల శబ్దము లనుకొనఁబడు యదృచ్ఛాశబ్దములవలె జాతి, క్రియా, గుణ

ములు లేక కేవలము సంజ్ఞామాత్రముగా వీరశబ్దము నిలువవలసినదేనా ? సూర్యచంద్రులిద్దఱు సమానాపకారులైనను రాహువు చల్లనికిరణములు కల చంద్రుని పదే పదే మ్రింగుట, వేడి కిరణములుకల సూర్యునెప్పుడో కాని గ్రసింపకుండుటనుబట్టి చూడ మెత్తదనము మొత్తబడుటకు కారణముకాదా ? ఉన్నతస్థానమెక్కుటకు నిచ్చెనమెట్లాధారము కావలయునట్లు కీర్తికాంత స్వర్గమునకెగబ్రాకుటకు శత్రువులతల లాధారము కావలదా ? కీర్తికి పౌరుషమేకదా ప్రధానము. మెత్తదన మెప్పుడును కళంకమే. ఒకజింకనెక్కించుకొన్నమాత్రమున చంద్రునకు మృగాంకుండను మచ్చ యేర్పడినది. అనేక జింకలను చంపినందువల్ల సింహామునకు మృగరాజను పేరువచ్చినది. ఒడలంతయుం జెమట పుట్టించి కుదర్చవలసిన యామజ్వరమును చల్లనినీరు చిలికి మాన్పంబూనుట వెఱ్ఱివైద్యుని లక్షణముకాదా! మల మల మరుగు చమురులో చల్లని నీటిబొట్లు పడిన చిటపటలాడి చిందులుద్రొక్కి యందేమాయమగునట్లు అసూయాగ్నిజ్వాలలమంటలెగయు నాకౌరవసభ నీ చల్లని శాంతివాక్యములు మటుమాయములు కావా ? రాహువు షోడశకళాపూర్ణ చంద్రుని గ్రసించినట్లు అభివృద్ధిలోనున్న శత్రువును జయించుట కీర్తికాదా ? సూర్యుండెండ కాయును, అగ్ని మండును. అట్లే పౌరుషశాలి శత్రువును జయించును. ఇది సహజసిద్ధము. క్షయరోగ మెల్లరోగములకు సమష్టిరూపమైనట్లు కౌరవసభ యన్నికుయుక్తులకు, నవినీతులకు సమష్టిరూపముకాదా ? అదియెట్లు శాంతివాక్యముల సమాధానపడగలదు ? ఎవండైన దుమ్మును కాలితో జిమ్మును కాని అగ్నిని ముట్టుటకుంకించునా ? మన మెత్తదనమే వారినిట్లు మొత్తంజేసినది. ఆకాశమున మేఘముగర్జిల్లుట విని సింహాము గుహాలో గర్జిల్లును. అది ప్రకృతిసిద్ధము. మహానీయుల కది స్వభావము. పరాక్రమవంతుండెచట నున్నను గణనీయుండే. పంచాగ్నుల స్మరణమున సూర్యుండెచటనున్నను స్తుతిపాత్రుండు కాదా ? సింహాము స్వయముగా చంపుకొనిన మత్తగజమునే భక్షించును కాని యన్యాహారముస్వీకరింపదు.

అట్టి తేజస్వి యితరులమనువర్తిని నెట్లంగీకరించును ? ఆనుషంగికముగా సంపద లభించుగాక, లభించకపోవుగాక. అభిమానధనుఁ డెప్పుడును నశ్వరమైన ప్రాణంబులచే సుస్థిరమైనకీర్తినే బడయగోరును. కృష్ణా! పెక్కుగొడవలెందులకు? మొదటినుండియు నాకురుకువరారులకు నాయందే యెక్కువయసూయ. నా శరీరబలమే వారినట్లుగావించినది. విషము పెట్టినారు. విషసర్పములచే కరపించినారు. నిద్రలో కాలు చేతులుకట్టి మేడపై యంతస్థునుంచి గంగలోనికి నెట్టివేసినారు లక్కయిల్లు నన్నుగులించియే తగులబెట్టినారు. నే నవమానము సహింపఁజాలనివాఁడను. నా కోర్పనునది లేదు. నాకు కాలము, కర్మము, దేవుఁడు, దెయ్యము అనువాని కంటె నా బాహుబలయందే నాకు విశ్వాసము. పౌరుషశాలిని. అవమానము సహించలేని యభిమానధనుఁడను. అట్టి నా కళ్ళయెదుటనే మా వధూటియగు పాంచాలి యభిమానములూటీ చేయఁబడినది. కాని యన్నగారియాజ్ఞాంకుశము, అర్జునుని గాంభీర్యవినయోక్తులు, నన్ను ముందున కురుకనిచ్చినవి కావు. నేనుదేనిని లక్ష్యపెట్టకున్నను మాయన్న ధర్మజుని యొక్కయు, తమ్ముఁడర్జునుని యొక్కయు ప్రవర్తనసూత్రముల మధ్యను కట్టుబడి నిరుపయోగినైతిని. కాని ద్రౌపదికి మానభంగముకల్గు నా సభలో వారలయకృత్యములకు నానోటినుండి యప్రయత్నముగనే కొన్ని మాటలు వెలువడినవి. అవియేమన - జుట్టుపట్టుకొని యీడ్చుచు ద్రౌపది వస్త్రములాగుచున్న దుశ్శాసనుని యకృత్యము నీక్షించుటచే వాని రొమ్ము బ్రద్దలుకొట్టి యందున్న వేడినెత్తురు యుద్ధములో త్రాగుదుననుట యొకటి. నిన్ను విడిపింపఁజాలని యీ యేపురపతులతో నేమిలాభము? నా తొడపై కూర్చుండుమనునట్లు తొడకనబరచిన దుర్యోధనుని తొడలు గదచే విరుగగొట్టుదుననుట మఱియొకటియు శపథములు గావించితి. ఇంకను నూర్వురు దుర్యోధన సోదరుల మిగిలిపోకుండ నేనే చంపుదు ననియు ప్రతిజ్ఞ చేసితి. యుద్ధము కాకున్న నీకోరికలెట్లీడేరును? ఏవిధమునను యుద్ధమే సమంజసము కాని సంధికుపక్రమించుట నామతము కాదు.

విజయమో, వీరస్వర్గమో యేదోయొకటి తేలిపోవలసినదే! యుద్ధము వలన ప్రజాక్షయమగునను భీతియున్న దుర్యోధనునకు నాకును గదా యుద్ధమున తులారణమేర్పరచినను నాకు సమ్మతమే. కాని నేను జయించిన రాజ్యము వచ్చుటయేగాక కురుకుమారుల నందరఁజంపుట, దుశ్శాసనుని రొమ్ముచీల్చి వేడినెత్తురు త్రాగుట, దుర్యోధనుని తొడలు విఱుగగొట్టుటఁ అను నీ శపథములు మాత్రము తీరవలసినవే.

(అర్జునుని ప్రవేశము)

కృష్ణు : అర్జునా! నీయభిప్రాయమేమి ?

అర్జు : బావా! విశేషజ్ఞులయెదుట నీతిశాస్త్రము వివదపర్చుట తాను నేర్చుకొన్నది మఱచిపోకుండ మఱల మఱల వల్లించుటకాని పాండిత్యప్రకటనమునకుఁగాదు. పెద్దన్న ధర్మరాజు సంధికోఱకు నీవొకపరి కౌరవసభకుపోయి యచ్చటి సత్యాసత్యములు, బలాబలములు తెలిసికొని వచ్చుటయే మంచిదనుటయు బాగుగనేయున్నది. చిన్నన్న భీమరాజు సహజశత్రువులు దాయాదులు ఆదినుండియు మమ్ముల మట్టుబెట్టి రాజ్యమపహరింపఁజూచు దుర్మార్గులు నగు కౌరవులతో సంధి యొనగూర్చుకొనుట మంచిదికాదనుటయు సమంజసముగానే యున్నది. ఈ భారతము కర్ణతలభారతము. కురుకుమారుల యస్త్రవిద్యాప్రదర్శనము నాటినుండియు కర్ణుఁడు నాపైన మచ్చరించి యుద్ధమునకు దుర్యోధనుని పురికొల్పుచున్నాడు. ఆ దుర్యోధనుఁడును భీమునకు తాను సరిపోవుదుననియు, నాకాకర్ణుఁడు సరితూగుననియు ధైర్యమువహించి అంగరాజ్యమొసంగి రాజును జేసి, తన పేరుమీదుగా వానిని రాజ్యమేలించి యీ కయ్యమునకు కాలుదువ్వుచున్నవాఁడు. ద్రౌపదీ స్వయంవరసమయమున మత్స్యయంత్రభేదనము వారి యసూయ నినుమడింపఁజేసినది. ద్రౌపదీ వస్త్రాపహరణసమయమున ద్రౌపదిని తూలనాడు కర్ణుని తల యుద్ధరంగమున దుల్లనేయుదునని నేనును ప్రతినఁగావించితిని. అరణ్యావాస సమయమున నా శౌర్యమునఁబశుపతిని మెప్పించి పాశుపతమును సంపాదించితి

నివాతకవచ కాలకేయాదుల సంహరించి యింద్రుని మెప్పించి స్వర్గమున నైదు సంవత్సరములుండి యచ్చటి కర్మాగారములలో నూతన పరిశోధనల వలన తయారగు ననేక మారణాయుధముల మర్మముఁదెలిసికొంటిని. ఒక్కక్షణమాత్రమున కౌరవసైన్యమేకాదు ప్రపంచమారణముఁ చేయగల దివ్యాయుధములున్నవి. నా నిఘంటువున నపజయశబ్దమేలేదు. అటులని ధర్మరాజు సంధిప్రస్తావనము తోసిపుచ్చనూకూడదు. అన్న భీముని పౌరుషవాగ్ధోరణియు సమంజసము కాకనూపోదు. ఇట్టి విషమ సమయముల నాలోచనకు పనికివత్తువనికదా యన్నగారి యాజ్ఞను పదివేపుర నారాయణగోపాలబలమును దుర్యోధనునికివీడి నిరాయుధుఁడవైన నిన్నుగోరుకున్నది.

భీము : అందులకుగాదు భోజనము మిగిలిపోవ్వనని.

కృష్ణ : బావా! నీ భాగమునకు నేనేమైన యడ్డుతగులుచుంటినా?

భీము : మాకున్ననుగదా నీకుఁబెట్టునది. యాచించుకొనిరమ్ము. అందరము కలిసి భుజింతము.

అర్జు : బావా! హేళనలకేమిగాని యిటువినుము. వివేకజలముచే విధిబీజముల నెవఁడు తడుపునో వాఁడు లోకమున శరత్కాలమువలె ఫలితక్రియను బొందును. గట్టిగానున్న మంచముపై మెత్తని పరుపు, దిండు పఱచుకొని నిశ్చింతగా విశ్రమించునట్లు యుక్తాయుక్తమయినది చంచలముకానిది యగు బుద్ధి నాశ్రయించి ప్రజ్ఞావంతుఁడగు వానికి ఏ కష్టము, యేలోకనిష్ఠురములుండవు. బుద్ధివంతులు తొట్రుపాటులేక కొలదికాలముననే గొప్పపనులు చేయుదురు. అల్పబుద్ధులు తొట్రుపాటుతో పెద్దకాలమునకును కొలది పనులైనను చేయఁజాలరు. వ్యాధిగ్రస్థుఁడు లత్యపెట్టక అపత్యముచేసినను బలిష్ఠుఁడుగా నున్నంతవఱకు రోగవికారములు బయల్పడకుండ లోపల నణగియుండి కాలము పక్రించునపుడు మందులకు సాధ్యపడక ప్రకోపించి వినాశముకల్పించునట్లు వారి యవగుణములే వారికి నాశనముఁగల్పింపఁగలవు. శబ్దార్థములు పౌరుష

హైదైవికములవలె మాయన్న లిద్దఱి వాక్యములు ననుసరణీయములే. వానిని నిర్ణయించుటకు సమర్థుఁడవగు నీవున్నావు. నీ వెటులచేసినను నాకిష్టమే. కాని నేనొకటిచెప్పుచున్నాను. యుద్ధమువల్ల ప్రజాక్షయమగు నను భీతియున్న చిన్నన్న భీమరాజు చెప్పినట్లు నాకును కర్ణునకును తులారణమేర్పాటుచేసినను నాకిష్టమే. మాయన్నదమ్ముల బిడ్డలలో పెద్ద వాఁడగు మా యభిమన్యునకు రాజ్యమువచ్చునను యపేక్షయు నాకు లేదు. మేమందఱము సమానముగ పంచుకొనునట్లు ధర్మశాస్త్రమున నూతనసూత్రము కల్పించినను నాకిష్టమే. యుద్ధమున శత్రువులఁజంపి కీర్తినివడసి ప్రజాభిప్రాయమున రాజ్యము పరిపాలించినను నాకు సమ్మతమే. ప్రజాస్వామ్యము మఱింతయిష్టము.

(నకులుని ప్రవేశము)

కృష్ణు : నకులకుమారా! నీయభిప్రాయమేమి ?

నకు: షాది అనగా అంశస్వరము. షడ్జాదిస్వరము లంగములు. దాని వ్యాపకత్వమే సంగీతము. అటులనే మాయన్నగారల యుద్దేశ్యములు వ్యాపకత్వమును నొందించుటతప్ప నేను చెప్పునది మఱియొకటికాదు. కౌరవ్యులు మాకపకారము చేయతలపెట్టని నిముసములేదు. కాని యొకఁడు గోవునుకొట్టిన మఱియొకఁడు దూడనుకొట్టవలెనా ? అన్న ధర్మరాజు వచియించినట్లు సంధికిప్రయత్నించుటయు మంచిదే. కానితరి యిక మిగులునది యుద్ధమే. అందు జయముకలిగిన మంచిదే. మరణము కలిగిన యంతకన్నను మంచిదే. ఇది నా నిశ్చితాభిప్రాయము. అన్న ధర్మజుఁడు చెప్పినది అనుకూలపక్షము. భీమన్న చెప్పినది ప్రతికూలపక్షము. అన్న అర్జునుఁడుచెప్పినది యీ రెంటికిని సమన్వయపక్షము. ఇఁక మిగిలి నదేది ? వారి మూవుర యేకాభిప్రాయమును నంగీకరించుటయే నా స్వపక్షము. కాని నెయ్యమొనర్చుకొని వచ్చినకదా నిన్ను పంపు చున్నందులకు సార్థకత ?

(సహదేవుని ప్రవేశము)

కృష్ణు : బావా! సహదేవా! నీ యభిప్రాయమేమి ?

సహ : స్వరములు ఏడు. మేళకర్తలు డెబ్బదిరెండు. కాని రాగము లసంతములు. ఆలాగుననే యన్నగారల యభిప్రాయమును నాధారముగా జేసికొనియే నేను వానిని విస్తరించుచుంటిని. సంధి కాదు యుద్ధము జరుగును. అందు తప్పక మేము విజయమునొందఁగలము. కౌరవులు నాశనముఁజెందుదురు. అన్నగార్ల శపథములును తీరును. అన్న ధర్మరాజు ధర్మమునునిలఁబడును. నీ కోరికయు నెఱవేరును. ఈ సందులు గొందులు కపటనాటకములుకాని యివి కార్యరూపము ధరించవు. బావా! నీవు కౌరవసభకు పోవుటకు నుబలాటపడుచుంటివి కాని అక్కడి వార లశక్తిదుర్జనత్వముఁజూపకపోరు. దానివలన నీకుఁగలుగు కోపమును మాకు సహాయకారి కాకపోదు. కాన నీవెవరినైన తోడు తీసికొనిపోవుటయు మంచిదని నాకుఁదోచుచున్నది. అన్నగార్ల యభిప్రాయముల ననుసరించియుండెడి నీ యిష్టముతో నే నేకీభవించుచున్నాను. సంజయు నట్లుకాక నెయ్యమో, కయ్యమో తెల్పుకొనిరమ్ము. ఈ నైచ్యాను సంధానమువలన మన నీచోపజీవనము స్థిరపరచుకొనుట, మా యసమర్థత నీమూలమున కురుపతికి నివేదించుకొనుట యగుచున్నదియేమో యని నా సందేహము.

కృష్ణు : మీమీ యభిప్రాయములు ప్రకటించిరి. కాన దాని కనుగుణముగనే ప్రవర్తించుటకు నేనును సిద్ధముగనున్నాను. ధర్మరాజుగారి యానతిని బోయివచ్చెద. (అని వెళ్లబోవును)

(ద్రౌపది ప్రవేశము)

ద్రౌప : అన్నా! నన్నేమియు నడుగ వేదేమి ? కౌరవులచే మంగళహారతులుగొన వేగిరపడుచుంటివా ?

భీమ : అబలలు రాచకీయములకు, యుద్ధములకు పనికిరారని మా పురుషుల యభిప్రాయము.

ద్రౌప : ఓ పురుషులు, పౌరుషము. అన్నా! నేనును వీరలకర్ధాంగి నగుట వీఱందఱు నొక్కొక్క వ్యక్తియే కాని నేను రెండున్నర వ్యక్తిని. అందువలన నాకును మాట్లాడుటకు హక్కు కలదు. నేను పలుకునదియు వీరి మాటలకు వ్యాఖ్యానముకాని వేఱుకాదు. ఇది వీరలకు సంబంధించిన రాచకీయముకాదు. ఇది నాకు సంబంధించిన రాచకీయము. ఇది కురు పాంచాల యుద్ధముకాని కురుపాండవ యుద్ధముకాదు. కాన అన్నా ! నీవు సంధియొనర్చుట కక్కడికి పోగూడదు. పోవుట యులుసుఁదనము. సంధియొనఁగూడిన ప్రమాదము. కుటుంబమున నన్నదమ్ములమాటలకన్న అక్కచెల్లెండ్రమాటల కాదరము మెండు. కాన నా మాటలు నీవు శ్రద్ధగా నాలకించవలసినదే, అంగీకరించవలసినదే, ఆచరించవలసినదే. కలహావృత్తమునకు స్త్రీలు కూకటివేరులని మీ పురుషులు నిందించిన నిందింతురు గాక. యుద్ధమే కర్తవ్యము. సంధి యకర్తవ్యము. స్త్రీలు కలహాబీజము లైనట్లు బ్రాహ్మణులును కలహాకారకులే. ఏమన ? వీరి గురువగు ద్రోణుఁడును మా తండ్రియగు ద్రుపదుఁడును యొకేగురువువద్ద చదువు కొనిరట. అది నెపంబుగా నిండుసభగొలువుఁదీరిన మహారాజగు మాతండ్రి యొద్దకు ద్రోణుఁడువచ్చి చినిగిన గుడ్డలుతో నలౌకికముగ మిత్రమా ! ద్రుపదా! నాకొక పాలిచ్చుయావును తోలిపెట్టవా ? యనిపల్కినాడట. లౌకికులతో నిండియుండు నారాజసభను వీని యలౌకిక ప్రసంగమునకు, ప్రవర్తనమునకు మా తండ్రి తిరస్కారభావము చూపెనట. అది నెపంబుగా హస్తిపురికిఁజేరి తన బావమఱదియగు కృపునితోను, కుమారుఁడగు నశ్వత్థామతోనునుండి భీష్మునియాజ్ఞఁగురుపాండుకుమారులకు నస్త్రవిద్య నేర్పి వారిని మా తండ్రిపై నుసుకొల్పెను. అందు మీబావ యర్జునుఁడు మాతండ్రినిబంధించ ద్రోణుఁడు పరాభవించి కృతకృత్యుఁడయ్యెను. అందు వలన మా తండ్రి కటకటంబడి యర్జునుని శౌర్యమునకు సంతసించి వానికి భార్యగ నిచ్చుటకుఁదనకు కుమార్తెయు, ద్రోణుని సంహరించుటకుఁగొమరుఁడును పుట్టవలెనని యజ్ఞముఁజేసెను. అందువలన ద్రోణుని జంపుటకు

మాయన్న దృష్టద్యుమ్నుండును, అర్జునునకు భార్యకాఁగల నేనును పుట్టితిమి. మత్స్యయంత్రభేదనావసరమున నన్నర్జునునకిచ్చి వివాహము చేయు సందర్భమున ద్రౌపదిమూలమున పాండవులకు పొరపొచ్చెములు కలుగగలవని ద్రుపదుఁడొక్క యర్జునునికే సహాయపడునని యందఱును భావించిరి. కాని యందఱకును నేను పెద్దలయాశీర్వాదమున ధర్మపత్నినగుట, నేనును పొఱపొచ్చెములు, అంతఃకలహములు కలుగకుండ జాగ్రత్తగ సంచరించుటవలన మేమందఱము నేకీభవించి ప్రవర్తించుట యే తటస్థించినది. మా పాంచాలదేశమందలి యీర్ష్యచేతను, ద్రోణుప్రోత్సాహమునఁగల్గు మా తండ్రియందలి యసూయచేతను, యీ పాండవుల రాజ్యకాంతచేతను, నేను వారల లక్ష్యపెట్టకపోవుటచేతను ఆ కౌరవులకు నామీదనే మఱింత యసూయాగ్ని ప్రజ్వరిల్లినది. దాని పరిణామమే నా వస్త్రాపహరణము. సమర్థులగు భర్తలు చూచుచుండ మిగిలిన కురువృద్ధులుదాసీనభావము వహించుచుండ వీరవనితను, వీరపత్నిని, వీరమాతనునైన నన్ను రాజసూయావభృథస్నానమున పవిత్రమైన యీ జడనుబట్టి యీ నీచుఁడగు దుశ్శాసనుఁడు లాగి పరిభవింప నాకోధాగ్ని నెటులోర్వఁగలను ? ఎటుల దానినతిక్రమింపఁగలను ? అప్పుడు నా పాతివ్రత్య ప్రభావమే కాపాడినదికాని లేనియెడల నేనేమికావలసినది ? ఆ దృశ్యమును జూచుచు ధర్మజుఁడూరకున్నను, వాని యాజ్ఞాబద్ధులై భీమార్జును లూరకున్నను, వారి వదనగహ్వరములనుండి యప్రయత్నముగ దైవికముగ ప్రతిజ్ఞలు బయలుదేరినవి. అవియేవన ? గదచే యుద్ధమున కురుకుమారుల నూర్వురఁజంపుదునని యు, దుర్యోధనుని తొడలు విఱుగఁగొట్టుదుననియు, దుశ్శాసనుని ఱొమ్ముఁజీల్చి నెత్తురుఁద్రావి యీ రక్తహస్తములు "ద్రౌపదీ! నీ వేణిని ముడివేయుదు"ననియు మారుతి ప్రతిజ్ఞలనొనరించె. కవ్వడి కర్ణునితలద్రుల్లనేయుదునని ప్రతిజ్ఞఁజేసె. అట్టివారలప్రతిజ్ఞలు నా పరాభవాగ్ని యీ సంధివాక్యముల చల్లారునా ? ఆనావేణిఁబట్టి లాగిన యీ దుశ్శాసనుని చేయి మొదలుగా ధుర్యోధను కళేబరము యుద్ధ

ములో నింతింతముక్కలై యిది పలానావాని రూపమని నిర్దేశించుటకు వీలులేని పరిస్థితి కళ్ళారా చూచిననే నా యీయాయుడుకు చల్లారునుకాని యొండువిధమున నెట్లు చల్లారఁగలదు? ఎప్పుడైనను యుద్ధము జరుగక పోవునా? నాకోరిక లీడేరకుండునా ? అని గంపంత ఆశతో నెదురుచూచు చుండ వీరలయసమర్థత కప్పిపుచ్చుకొనుటకై యీ సంధిప్రయత్నములు గావింపఁబడుచుండెనని స్పష్టపడుచున్నది. ఇది మా పాంచాలదేశమునకు సంబంధించిన విషయముకాన భీష్ముని సంహరించుటకు మాయన్న శిఖండియు, ద్రోణుఁనిసంహరించుటకు నాతోబుట్టువు దృష్టద్యుమ్నుఁడును, మిగిలిన సైన్యమును నాశనముచేయుటకు మా తండ్రి ప్రోత్సాహముకల పాంచాల సృంజయకేకయాది సైన్యములును సిద్ధముగనున్నవి. ఇఁక నా చెల్లి సుభద్రయు; కోడండ్రగు సుత్తరాశశిరేఖలును ససైన్యయుతముగ మాయక్క హిడింబియు, సత్యభామా మొదలగు మా వదినెలు పదియారు వేల యెనమండ్రును కూడుకొని మామహిళామండలియెల్ల చీరలుబిగించి కత్తులు ఝళిపించి యింకను మాకు సంబంధించిన మాత్స్యాదిసైన్య ములఁగూడకట్టుకొని పిల్లలగు నుపపాండవులుఁ ఉలూపి కొడుకు ఇలా వంతుఁడు, చిత్రాంగద కొడుకు బభ్రువాహనుఁడు, అభిమన్యుఁడు, ఘటో త్కచుఁడు, ఉత్తరుఁడు మొదలగువారి చేయూతలతో యుద్ధము ప్రక టించి శత్రువుల రూపుమాపి. కర్ణుని చంపి, తత్ఫలితమును నర్జునుని గాండీ వమునకును, కురుకుమారుల సంహరించి దుశ్శాసనుని బొమ్మఁజీల్చి, దుర్యోధనుని తొడలు విఱుగఁగొట్టి తత్ఫలితమును భీమునిగదకును ధార పోసి, ప్రతిజ్ఞాభంగములుకాకుండ వారి ప్రతిజ్ఞల వారికి చెల్లించి మా కోర్ధాగ్నులనుపశమింపఁజేసికొని లోకమున శాంతిని నభివృద్ధిపఱచి మా యత్త కుంతికి సామ్రాజ్య పట్టాభిషేకముఁగావించి లోకకళ్యాణముఁ గావింతుము. నీవును, నీ బావలును సుఖంబుగనుండుడు. కాని సంధికి మాత్రము పోకుము.

కృష్ణు : అమ్మా! పాంచాలీ ! నీవు కౌరవుల వేడినెత్తురుఁ గ్రోలు

టకు నవతరించిన కాళికాదేవివికాని పాంచాలివికానట్లు తోచుచున్నది. కృతయుగమున పరశురాముని తల్లి రేణుకవలన రక్తము ప్రవహించిన దందురు. అటులనే సీతవలనఁ ద్రేతాయుగమున రక్తవాహిని వెల్లివిరిసినది. ద్వాపరమున రక్తవెల్లువను పొంగించుటకు నీవుద్భవించితివి కాబోలు. ఇంక కలియుగమున నేయింటికాయింటికే మహామారి బయలుదేరు నను కొందును. ఇన్నాళ్లోపికపట్టినదానవిఁక కొలదిరోజు లోపికపట్టలేవా ? బావలేదో పలుకుచుండ నీవిటుల ప్రతిఘటించుట తగునటమ్మా ? వస్త్రాప హరణసమయమున దైవబలముఁగాంచియు నిక్లేల పౌరుషమునకు కాలు దువ్వెదవు పిచ్చితల్లీ ! మానవుఁడెంత కష్టపడి కృషిచేసినను దైవానుకూల్యములేక ఫలితముఁనొందజాలఁడమ్మా! ధర్మరాజు నాజ్ఞ నెరవేర్చుట మన విధి. పైన దైవాధీనము. రోగమును రమ్మని యెవ్వరును కోరు కొనరు. వచ్చినపుడు దానికిఁ బ్రతిక్రియ చేదుఔషధమును సేవించుటవినా గత్యంతరము కనుపించదు. అది శిష్టాన్నమున శమింపదు. యుద్ధమున రక్త ప్రవాహము కాక మఱేమికలుగును ? అది మాన్పుటకు వ్యక్తిధర్మమునకు మించి సామాజికధర్మమైనపుడు వ్యక్తియేమిచేయగలఁడు ? కాలప్రవాహమున కొట్టుకొనిపోవలసినదేసుమా ! (**సహదేవు నుద్దేశించి**) బావా ! సహదేవా ! ఎన్ని కట్టెలపోప్రులకాల్చినను అగ్ని తేజస్సున సూర్యుని మించఁజాలనట్లు నీవు చిన్నవాఁడవైనను నీవాక్యములు చిన్నవియైనను విపులార్థసంచయములై యితరుల వాక్యముల లీనబరచుకొనుచున్నవి. శాస్త్రములెన్నిచదివినను కర్తవ్యాకర్తవ్య నిర్ణయములేని మాటలు గుఱి తప్పిన బాణములుగల విలుకాని గంతులువంటివికాని సార్థకతఁజెందునవి కావు. (**నకులునుద్దేశించి**) బావా! నకులకుమారా! నీ మాటలును ధర్మనిర్ణయములు, కాలజ్ఞానజ్యోతకములునై యున్నయవి.(**మిగిలినవారల నుద్దేశించి**) ధర్మ. భీమార్జున బావలారా ! మీ యభిప్రాయములు యుద్ధముగావింపఁబడుటయు, సంధి నామమాత్రముగ జరుపఁబడుటయుఁగా కనఁబడుచున్నది కావ నామమాత్ర సంధికిఁబోవుటయు, యుద్ధమునకుఁ బ్రోత్సహించుట

యేనా నేను చేయవలసినది? అటులైన సాత్యకితో నిప్పుడే బయలుదేరి పోవుదును.

ధర్మ : కృష్ణా! నీ జన్మనక్షత్రమగు రోహిణికి రేపటి రేవతీనక్షత్రమునకు తారాబల చంద్రబలము లనుకూలములుగ నున్నవి. కాన రేపు బయలుదేరి వెళ్ళుము. మఱియొకటి వినుము. నామమాత్ర సంధియను చున్నావు. అటుల కాదు. సంధికే తప్పక ప్రయత్నించుము. యుద్ధము మాట తలపెట్టకుము. అది పాపభూయిష్ఠము. ఈ నా యొక్క రాజ్య కాంక్షవలన కుటుంబ నాశనము, ప్రజానాశనము, లోకసౌభాగ్యవినాశనమునగును. కాన యుద్ధమునకు సంసిద్ధపడు పరిస్థితులేర్పడినప్పుడు సంజయుఁడు పలికినట్లుగా యుద్ధముచే కలుగు రక్తాన్నముకంటె, భిక్షాన్నమే మంచిదనుకొందును. మఱల తపస్సునకై వనమునకే పోవుదునుకాని యట్టి హింసాకృత్యము మాత్రము నేను గావింపలేను.

భీము : నేను కాంక్షించునది భిక్షాన్నము కాదు; యుద్ధమువలన కలుగు రక్తాన్నమును కాదు; సాటి మానవుఁ డుపవాసములచే కృశించుచుండ తెగతిని దీనజనులవెక్కిరించు భాగ్యవాద ప్రజల కుక్షి నిక్షిప్త రక్తాన్నము. నిన్న సంజయుఁడు పలికిన యూకదంపు వ్యవహారము, నిరోష్ఠ్య రామాయణము, పట్టింప రాయబారము. మాయన్న తలకెక్కినది కాబోలు. "నీవునిలబడు. నీ రక్తము నేను త్రాగెదను. నీవుచావు, నన్ను బ్రతుకనిమ్ము. ఎందుకు యుద్ధము?" అని యతఁడుచెప్పినది యన్నకు సమంజసముగా కనబడినదికాబోలు.

కృష్ణ : బావా! మారుతీ! ధర్మరాజు చమురు. సంధిరాయబారినగు నేనువత్తిని. యుద్ధాగ్ని దీపము. దాని ప్రజ్వలనమునకే యీ సంధి రాయబారము. శాంతింపుము. యుద్ధము లెలాగున బయలుదేరునో నేను మనవిచేసెద. మానవుల క్షుద్రహృదయములు తపింపఁబడి సామాజిక ఆకాశమున నభివృద్ధినొంది యది యుద్ధరూపమున బయలుదేరును. ఇప్పుడు ప్రతి వ్యక్తియూ నొక్కొక్క యగ్నిభట్టీవలె తయారయినాడు. ఈభట్టీ

లన్నియు నేకమై భయంకర ప్రళయాగ్నిరూపము ధరించును. పరాచ కీయచిక్కులను మిషచేతనో, ప దేశప్రేమ ఆధారముతోనో అది రగుల్కొని విశ్వవ్యాప్తి చెందును. ఆ హాలాహలము స్వార్థ ప్రిద్వేషముల వ్యాప్తి నొందును. అమృతము కుంభపూరితమై యున్నను నొక విషబిందువున నది విషరూపముఁదాల్చును. మీ య్యైదుగురి సుఖమునకుకాదు. ఈ కోట్ల కొలది జనుల ప్రాణములతీయుట? మీ య్యైదుగురి సుఖము నిమిత్త మాత్రము. ఈయుద్ధోన్మాదము, శౌర్య వీర్యధనులకు నంటువ్యాధివంటిది. మన యందరియొక్క యహంకారాగ్నికి తొంబదితొమ్మిది పాళ్లు బయటి ద్వేషాగ్ని దోహదమిచ్చును. నవ్వుచు నుప్పొంగుచు మహామారి యప్పుడు నలుదిక్కులకు బర్వెత్తుచు విలయతాండవము చేయును. అప్పుడు తత్త్వ చింతకు తావుండదు. గంభీరాలోచనల కస లవకాశమే లేదు. ప్రాణా రణ్యముల కసూయాగ్నిజ్వాల లంటుకొనును. నరునిలో దాగియున్న క్రూరశార్దూలము బయట సంచారముచేయును. యుద్ధపు పిలుపువిని యభిమానముతేచి నిలువఁబడును. చిన్నవాళ్ళకుకూడ పెద్దనరాలుపగుల గొట్టి రక్తము ప్రవహింపుటకు ప్రయత్నించును. చేతిలోని కాయుధము దానంతటదే వచ్చును. చేతులే యాయుధములుగ తయారగును. ధర్మ రాజా! యుద్ధమగునను నీ హృదయవేదన నిరర్థకము. యుద్ధము పాపమో, పుణ్యమో. యది యుద్ధసమయముల విమర్శించు టనవసరము. భిక్షమెత్తుట, తపముచేయుట, వనమునకుఁబోవుట అవి వ్యక్తియొక్క ధర్మములు. ఇప్పుడు నీయొక్క క్షేమమునుకాదు చూచుకొనునది, నీపరి జన క్షేమమునుకూడ వీక్షించుము. నీపరిజనమునడుగు, లోకము నడుగు. లోకము, పరిజనులు యుద్ధమునేకోరుచున్నారు. నీయొక్కనివలన నిది యాగునదికాదు. కొంపలంటుకొన్నప్పుడు అది ఘోర్యాగ్నా? తస్క రాగ్నా? అని యెవ్వరును విమర్శించరు. ఏది పుణ్యమో, యేది పాపమో మనమొక నిర్ణయమునకు వచ్చుటయు సులభముకాదు. సమయోచిత ముగ పుణ్యపాపకర్మలు మారుచుండును. ఒకప్పుడు పాపకర్మమే పుణ్యా

కర్మగాను మఱొకప్పుడు పుణ్యకర్మయే పాపకర్మగాను పరిణతిఁజెందును. సమరమున నపవాదులేక పోలేదు. నిష్కామయోగము నవలంబింపుము. అప్రయత్నముగ ద్వారముఖమున శత్రువుయొక్క పిలుపు వినబడి నప్పుడు నీవేమిచేయుదువు? నీవు మంచివాడవే యగుదువుగాక. ఎదుటి వాడు మంచివాడు కావలదా? నీ వష్టకష్టములు పడుదువుగాక. నిన్ను నమ్ముకొన్న నీపరిజనమును నిర్ముల నపాలుజేతువా? అట్టి సమయమున శక్తివంచన లేకుండ పోరాడుటయే ధర్మము. పాపపుణ్యముల కొలగీటు రాయి యిప్పటికి చూడబడలేదు. మాజాన భీమన్న చెప్పినట్లు బ్రతుకుటకు నిప్పువంటి వీరత్వము మాత్రము కావలయును. ప్రకటితమగు ప్రతీకార మందు యుద్ధము పాపహేతువు కాదు. ఎప్పుడైన మనలవిడుచు ప్రాణములను ధర్మపణమునకు విడుచుట యధర్మమా? స్వత్వము దొంగిలింపఁబడు చున్నప్పుడు త్యాగము, తపము, అనుకొనుట పాపముకాని పుణ్యమెట్ల గును? అసమర్థుడు యాచించునుగాని బలవంతుఁడగు సమర్థుఁడేల యాచించును? స్వార్థకులిశసంఘర్షణాగ్నికణాల యుద్ధ మొక్కొకపరి యని వార్యమే యగును. అనివార్యమునకు బాధయేల? అగ్నిపర్వతము బ్రద్ద లగును. నీవేమి చేయఁగలవు? మీరు బిచ్చమెత్తుకొని జీవించుట వలన యుద్ధము ఆగుననుకొందువా? ఖగోళమున క్రూరగ్రహకూటమి భూగోళమున తలలు బ్రద్దలగొట్టించుటకు సంసిద్ధపడియున్నది. ధర్మము, తపస్సు, వ్యక్తిధర్మములు. కరుణ, క్షమ, వినయము, త్యాగము, యిట్టివి వ్యక్తికి శోభ. ఇప్పుడిది వ్యక్తికి సంబంధించిన ప్రశ్నకాదు. సాముదాయక ప్రశ్న. తప క్షమముల మఱపు అవసరము. విశ్వకళ్యాణముఁగోరు నీవు కౌరవ నాశనమునకు బాధపడుచున్నావు. సమాజమునడుగు. యుద్ధ మనివార్య మంటుంది. ఎప్పుడుమీరు నిర్ధనికులయ్యు, సమర్థులరై ధర్మమునకు కట్టు వడి కష్టములనుభవించితిరో, అప్పుడా ప్రతీకారధర్మము సమాజముపై, లోకముపై పడినది. అన్యాయమునకు కంటగించు కొను ధర్మమూర్తులు మీకి ప్పుడు హితులు కాగలరు. వ్యక్తి సద్ధర్మములో చిక్కుకొని నపుంసకుని

వలె ఎప్పుడునీవు స్వపత్నీవస్త్రాపహరణ మానభంగము కనులార చూచుచు నూరకున్నావో, అప్పుడే యా ద్రౌపదితోఁబాటు, ప్రజలయభిమానములును చూరగొన్నవి. పిఱికివానివలె మాట్లాడి లోకమును, పరిజనమును మండించవద్దు. ఉత్తమపురుషున కాదర్శము వీరత్వము, బలిదానము. జాతిమందిరములో శూరత్వనివాళి వెలిగించి యుద్ధ విమానమునెక్కి వీరుఁడు విశ్వమునుండి వెడలిపోవును. త్యాగము, తపస్సు, భిక్ష, అందరి కిని తెలియును. అవి విరాగులైన యోగుల ధర్మములు. సాయక పిహీ నునినీతి బలహీనకాపురుషలక్షణము. యుద్ధభీరువు బ్రతుకుటకంటె చచ్చుటమంచిది. ఘాతుక మృగములు చుట్టుముట్టినపుడు బలిష్ఠమగు శరీర ముపయోగము కాని, మనోనైర్మల్యము పనిచేయదు. మనోబలము దేహమును కాపాడదు. మనమునకు దేహము కవచము కాని, దేహము నకు మనస్సు కవచముకాదు. మనోబలము దేహబలమునకు దోహద మీయఁగలదు. ఆత్మబలముతో దేహసంగ్రామమిప్పటి కెవడును జయించిన వాడులేడు. కత్తిదెబ్బతోనాత్మబలము వశముతప్పిపోవును. మహాత్ములగు ఋషుల యాత్మబలము, రాక్షసుల శస్త్రఘాతలకు గురి కాకపోలేదు. తపోత్యాగములలోనే నిరామయశక్తి యున్నదో అది వ్యక్తికి సరి పోవును. వ్యక్తిధర్మములు వేరు. సామాజికధర్మములు వేరు. వ్యక్తిధర్మమగు యోగశక్తి సామాజిక ధర్మమున కుపయుక్తముకాదు. మునుల యెముకల పోగులంగాంచియే శ్రీరామచంద్రమూర్తి దానవసంహారమున కుద్యు క్తుఁడైనాడు. కోమల మనస్సుగల సీత యొకప్పుడు శ్రీరామచంద్ర మూర్తితో మతిభ్రష్ట మానవులఁద్రిప్పుటకు శస్త్రమేకాని యితర సాధన ములు లేవా? యన్నది. తుదకు సాధనములు వేరేలేవని యనుభవము వలనఁ దెలిసికొన్నది. తపశ్శీలములవల్లమానవుఁడు బాగుపడుట నిజమే కాని పతిత జనసమూహ కుయుక్తిశరపాతముల యెదుట తపస్సు పనిచేయదు. సమరము నింద్యమేకాని యెదుటపక్షమువారు దానికే సంసిద్ధముగనున్న పక్షమున శాంతి మార్గముమరొకటిచెప్పు ? అవినీతిజ్వాల ప్రజ్వరిల్లు చుండ

సరళభావమెట్లు కలుగును? సుఖసమృద్ధికోశము మోసబలములతో ప్రోగు చేయఁబడి దుర్బలుని గ్రాసము హరించి ప్రాకారము నిర్మించుకొని విప్లవ గరళమును గుమ్మరించుచు ఓం శాంతి శ్శాంతిః అని శాంతి సుధను వర్షింపఁజేయుచున్న నాశాంతి సౌధము యెట్లునిలవఁగలదు ? ఎన్నాళ్ళు నిలువఁగలదు ? శాంతి వహించి నీ హృదయరక్తము త్రాగనిమ్ము. నీవు చావుము. నన్ను బ్రతుకనిమ్ము. అను నీతిచే శాంతి సామ్రాజ్యమును స్థాపింపఁదలఁచుట సాధ్యవిషయమా ? అట్టిశాంతియేనా సుస్థిరశాంతి ? భక్తులకు, జ్ఞానులకు వెలుపలి యుద్ధ మవసరములేదు. వారిది మనోబల ముతో నంతశ్శత్రుషట్కలనిర్మూలముఁగావించి స్థాపించు మోక్షశాంతిసామ్రా జ్యము. ఎంతవరకు ఖడ్గభీతిచే నశాంతి యణగద్రొక్కఁ బడియుండునో అంతవరకు సుఖభాగము నీతిధర్మములతో నిలుపసాధ్యముకాదు. ఎప్పుడధి కారి యవినీతిగా ప్రవర్తించునో, ఎప్పుడు సమాజమున కన్యాయము చేకూరుచుండునో, ఎప్పుడు ప్రజానాయకులు కపటనాటకమునకు సూత్ర ధారులై ప్రవర్తింతురో, ఎప్పు డెక్కడ నీతితో కూడిన సంధిప్రస్తావన భంగ పాటు చెందునో, ఎప్పుడు సత్యశిరస్సుతీయబడుచుండునో, ఎప్పుడు శాసన పరిపాలనకొక్క ఖడ్గధారణ మాత్ర మాధారమగునో, ఎప్పుడు హృద యములు క్రోధాగ్నిజ్వాలల మండుచుండునో, ఎప్పు డన్యాయము నవమానము సహించుచు మానవహృదయములుకుమిలి కృశించి నశించు చుండునో, ఎప్పుడొకనిని మఱియొకడు తిరస్కారభావమున చూచుచుం డునో, ఎప్పు డహంకారముతోబాటు ఘృణత్వాదిద్వంద్వప్రవృత్తి బహి ర్గతమగునో, ఎప్పుడు పైకిమాత్రము శాంతి సంభాషణలు బయలుదేరుచు క్రింద నిప్పు కణములు రగులొ్కనుచుండునో, ఎప్పుడు కాలాగ్నిలో నాజ్యముపోసినట్లు అణగద్రొక్కబడుట ఉపేక్ష, దమనము, అవమానము, ఎత్తిపొడుపు మాటలు బయలుదేరుచుండునో, అప్పుడు యుద్ధముకాక మఱియేమిజరుగును ? ఇతరులకు సుఖభాగము కల్పింపక తానుమాత్రము భోగలాలసుఁడై యాకలిబాధలచే నటమటించు దీనజనుల యాక్రందన

ధ్వనులు చెవులఁజొరనీయక పైకిమాత్రము ఓం శాంతిః శాంతిః, అను వాఁడాయుద్ధము నాహ్వానించునది? లేక వానిపాదతలమున నణఁగ ద్రొక్కఁబడుచు బక్కచిక్కి ప్రమాదపరిస్థితిలోనున్న బడుగుజీవియా యుద్ధము నాహ్వానించునది? యుద్ధమనునది భూమిబ్రద్దలయి పైకి వచ్చునదా? మంత్రశక్తితో కరాళశిఖవలె జన్మించునా? కాదు ప్రతిహింసాగ్ని హృదయములలో నుండుచుండ ఖడ్గముతో శాంతిని బోధించుట వలననే యుద్ధము పిలువఁబడుచున్నది. ఎప్పుడు నరునకు సుఖభాగము సమానము కాదో అప్పుడు శాంతిలేదు. ప్రభువు శరీరములమీదనే కాదు. హృదయములమీదకూడ రాజ్యము చేయవలెను. శ్రద్ధ, భక్తి, ప్రణయము ఉన్నత విశ్వాసములమీద హృదయ పరిపాలనజరుగును. న్యాయము శాంతికి మూలస్థానము. అట్టి న్యాయ విరహిత శాంతి మహలు దృఢత్వముకాదు. కృత్రిమశాంతి భయహేతువు. అది ఖడ్గమునువిడిచి విశ్వసించదు. సుఖసామ్యవాదపరిస్థితి తొలగిన శాంతిసిద్ధి దుర్లభము. ఎముకలు నమిలి, నెత్తురుత్రావి, మాంసముతిని యేశాంతి బ్రతుకును? అది మనోదాహము. స్వత్వమడుగునప్పుడు దొరుకక అన్యాయము జరుగుచున్నప్పుడు సంఘర్షణముకాక మఱేమి జరుగును? తనస్వత్వ మపహరింపఁబడినపుడు తేజస్వి చచ్చియో బ్రతికియో దానిని లాగుకొనఁజూచును. ఎవఁడు స్వత్వ ప్రాప్తి కొఱకు న్యాయఖడ్గమును యుద్ధమున నెత్తునో యప్పుడే యభయము సిద్ధించును. లేదా చంపుటయో, చచ్చుటయో జరుగును. దాన తేజస్వికి ఆత్మసంతృప్తి చేకూరును. మానవమర్యాద నుల్లంఘించు హింసయొక్క దెబ్బను తపస్సెక్కడ సహించినది? దేవతలు దానవులవలన పలుమార్లు ఓడుటయే తటస్థించినది కదా?

పౌరుషజ్వాలనముకంటె మనశ్శక్తి ప్రియమే. అట్లైన రాజ్యకాంక్ష యెందుకు? అడవులనుండి యెందుకువచ్చితివి? గరళపానము, గృహదహనము, వనవాసత్వము, కేశగ్రహణము, ఇట్టి ఘట్టముల క్షమ,

త్యాగము, శాంతిమార్గముల వహించితివికదా. ఏమిలాభము కలిగినది ? సుయోధనుఁడు నీవలన నోడినదెపుడు ? చేసిన నీచకృత్యములకు పశ్చాత్తాపపడినదెపుడు ? శత్రువును కష్టపెట్టుట యానందమేయగును కాని పరితాపహేతువెట్లగును ? కోరలు, విషము లేకపోవుట సర్పమునకు రామణీయకము కానట్లు, శత్రువునెడ వినమ్రతాసరళభావములు రామణీయకములుకావు. రామచంద్రమూర్తి సముద్రుని సహాయమర్థించి తాను సమర్థుఁడయ్యు మూఁడు రోజులు నిద్రాహారములుమాని యుపవసించి ధ్యానించినాడు. సముద్రుఁడు శ్రీరామచంద్రుని భీరువుగా జమకట్టి నిర్లక్ష్యముచేసినాడు. అప్పుడా సముద్రునితిక్క రాముని యాగ్నేయాస్త్ర ప్రయోగముతో సరియైనది. బంధనము, దాసత్వము అనువానికి లొంగినాఁడు. వినయదీప్తి బాణములలోనుండును. బలదర్పపౌరుషములు దేహధర్మములు. సహనశీలత్వము, క్షమ, దయ, మనోధర్మములు. ఈ రెంటిని జగత్తు పూజించును. అట్టివానితోకూడిన సంధివచనములే గౌరవింపఁబడును. దానియందే విజయశక్తి తాండవించును. ప్రతీకారసామర్థ్యము లేని క్షమ నిష్ఫలత్వము. శాంతి ధర్మపన్నములు గరళబిందువులను త్రాగించుటకు మిషలు. క్షమ నెపముచే పిఱికితనము కప్పిపుచ్చఁబడును. జ్వలిత ప్రాణి పౌరుషమునుతప్ప మఱేమి తెలిసికొనఁగలడు? స్పర్శతోనే హృదయమునుండి శిరస్సువరకు మండి శాంతివాక్యము వానిని కలవరపఱచును. ఎవని భుజాస్ఫాలనముల విస్ఫులింగములులేవవో, ఉప్పొంగు యెవనిరక్తములో నుడుకువేగములేదో వాఁడెట్లు శత్రువును జయింపఁగలఁడు ? హాలాహలమ్మురుచి శివునికెఱుకగాని యా శివపాదతీర్థముఁ గ్రోలు భక్తునకేమి తెలియును ? ఎవఁడాత్మబలమందలి నమ్మకముతో దేహబలము వమ్ముచేయునో, ఎవని హృదయాగ్నిజ్వాలకు నహంకార సమిధలు తోడుకావో వాఁడేమి శత్రువులఁజయింపఁగలఁడు? దెబ్బకు దెబ్బ కొట్టలేనివాఁడు కరుణ, క్షమ యని ప్రాకులాడును. సమర్థుఁడెప్పుడట్లు గావింపఁడు. అసమర్థుని నరములలో పౌరుషధారయుండదు. అవఁడు

నపుంసకుఁడు. వానివలన జాతికే ఘోరకళంకము. దేశమునకే విపత్తు. ప్రతిశోధలేని హీనులు పాపాత్ములు. చేతిలో నాయుధముకలిగియు దెబ్బ తినుచు నెవఁడు కరుణఁజూపునో వాని బ్రతుకువలన నేమిసార్థకత ? సర్పమునకు గడ్డిపరక తగిలినంత పడగవిప్పి ప్రతీకారమునకు ఒడుపు చూచు కొనుచుండును. ఏనుగు ఘీంకారమువిని సింహము గుహలో గర్జిల్లును. వేడి ముట్టుకొనుటచే సముద్రముప్పొంగి భూమిని మ్రింగుటకు ప్రయత్నించును. సూర్యకాంతపుమణి సూర్యపాదస్పర్శకు భగ్గుమనును. ఇట్టి జడజంతువులుకూడ ప్రతీకారమునకు ముందంజవేయుచుండ, తేజస్వి యెటులూరకుండఁగలఁడు ? అగ్నిమండునపుడు వాయువదే తోడగును. జ్వాలాముఖి సంచారముచేయును. భూమి గగ్గోలుపడును. ఆకాశమాహాకారముతో కూడుకొనును. కాలభుజంగము నెవఁడు కొట్టి లేపుచున్నాడు ? ఆకాశమునుండి పిడుగు నెవడు పడద్రోయుచున్నాడు ? అవినీతిధ్వజధారి యుద్ధమును పిలుచుచున్నాడు. ప్రమాదశూలముపై యతడు కాలూనుచున్నాడు. త్రొక్కేవాడా, త్రొక్కబడువాడా, యుద్ధమును పిలుచువాఁడు? ఆకలిని నెవఁడాపుచేయఁగలడు ? ఆహారము నపహరించువాడా, ఆహారము పోగొట్టుకొన్నవాడా, యుద్ధకారకుఁడు? వలపన్నువాడా, వల తెగ్రించుకొని పోజూచినదా 'దోషి'? దళితులు, మేలుకొన్న పీడితులు వీరల ఖడ్గము పాపహేతువుకాదు. అది పాప మనుకొనుట చూచేవారి హృదయదౌర్బల్యము. భ్రాంతి అణగద్రొక్కుటకు శాంతి సాధనము. యదార్థయుద్ధమునకు భీషణ అశాంతికి మౌనమువహించుట మానవుని యోటమి. అది దేశ్యుని యవమానపరచుటయేకాగలదు. భూతలమంతయు ఘాతుకత్వము, స్వార్థపరత్వము, అహంకారము, మోసము అలముకొన కరుణ, ప్రేమ, అహింస, వీనికితావెక్కడ ? అన్యోన్యమైత్రి యెట్లు సంభవము ? ఎట్లు క్రోధోద్వేగమాగును ? ఎట్లు యుద్ధమాపఁబడును? ద్వేషగరళ స్రవంతులు పొంగిప్రవహించి లోకమును ముంచుచుండ ప్రేమవాహినీప్రవాహమునకు చోటేది ? ఇట్టిసమయమున ప్రేమ బీజముల

నాటుట దుస్సాధ్యము. పోనీ సాధ్యమైయైనను అది అంకురించదు. పెరుగదు. ఫలితమునకురాదు. అట్టిప్రేమ మీ గురుపుర్వువలె పసీవంటి మానవ హృదయగహ్వరపు మాఱుమూలనో మెఱయుచుండును. ఆప్రేమ ద్వేషమను జాతికోటనెట్లుతాకఁగలదు? తాకినను నెట్లునిలువఁగలదు? శాంతి కాముకుఁడవగు యుధిష్ఠిరుఁడవు నీవొక్కరుఁడవు. అశాంతికాముకులగు దుర్యోధనాదులు పెక్కండ్రు. ఇట్టితఱి శాంతిలతకు పోషణద్రవ్యమేది? శాంతివీణ సునిశ్చితస్వరముల నెట్లాలపించును? యుద్ధాగ్ని హృదయ కుహరములనుండి బయలుదేరునదికాని పైనుంచి పడునది కాదుగదా! శాంతి ఖడ్గభయముమీద కాక విశ్వాసముమీద నాధారపడియుండును. శాంతి కుమ్మరసారెపై తయారగునదియు కాదు. ముఖము సుందరము, మాటలుమధుమయములు, శరీరము శుభ్రశ్వేతవస్త్రధారణము కలది. కాని దంతములు విషదంతములు, గృహములు జరాసంధగృహములు, తర్పణము తప్తాశ్రువులు, పిపాస రక్తపిపాస. ఎటుల శాంతి చేకూర్చబడును? ఎటుల యుద్ధమాపబడును? న్యాయమును హరించువాఁడు యుద్ధపిపాసి. సత్యాన్వేషణము పాపము కాదు. పాపము స్వీకరించుటకు నరకము పొందుటకు యుద్ధము నెవడును కోరఁడు. చావవలెనని చంపవలెనని యెవఁడును తలంపఁడు. నిజశాంతి ప్రేమనునిర్వర్తించును. కాని దురాచారమనుజుని శాంతియడ్డుకొనలేదు. రాక్షసుఁడు శిష్టుని శిక్షత గుర్తించదు. వినయమును, నీతిని పిఱికితనముగామాత్రము భావించును. సమయమునుబట్టి యవస్థ ఘోరత్వముఁజెందును. ప్రాణము అరచేతఁబెట్టుకొనే దుర్మార్గులపైఁబడుట కుంకించవలెను. యుద్ధమునకు విజయపరాజయములు మాత్రమే కారకులుకారు. ఒక రిద్దరికారణమువలన దేశపరిస్థితి మారదు. అగ్నిపర్వతము బ్రద్దలగుటకు పిడుగులుపడుట కారణముకాదు. భూమిలోని తాపముననే యటులబ్రద్దలగును. ఇద్దఱువ్యక్తుల రెండు కుటుంబముల, రెండుదేశముల సంఘర్షణము మాత్రమే యుద్ధముకాదు. అనేకమంది నరులహృదయాగ్ని భావి యిందిమిడియున్నది. ఇంతవరకు భూమి

మౌనమువహించి సహించినది. ఈయుద్ధము మీకు సంబంధించినదే కాదు. నాకును సంబంధించినదే. నాచే దెబ్బతిన్న ఘోరశత్రువుల బంధుపులు నేను మీ పక్షమువహించియుండుటఁ బ్రతీకారేచ్ఛతో ప్రతిపక్షమున గుంపులు గుంపులుగా చేరుచున్నారు. ద్వేష, క్రూర, అసూయ, డంభ, వ్యాపారములభివృద్ధిచెందినవి. పరిపాలకులలో కుటిలరాజనీతి కుదుటఁబడినది. కర్ణార్జునులకు శూరత్వమునపోటీ. ద్రుపదద్రోణులకు మిత్రద్రోహమున పోటీ. తండ్రి ఋణముదీర్ప కురువంశనాశనేచ్ఛతో శకునియాట. సంఘ సంస్కర్తనై యనేకమంది రాక్షసత్వముగల రాజులహింసించిన నాలీల కారణములుగాగల ద్వేషాగ్నియే యిట్టి యుద్ధరూపముధరించినది. ఏవిధముగాఁ జూచినను యుద్ధముజరుగు సూచనలే కనఁబడుచున్నవి. కాని యుద్ధమునకు పూర్వము మీచేపంపబడి కౌరవసభకుపోయి యక్కడ, మీన్యాయము, వారి యన్యాయము ప్రకటించి యుద్ధమువలన కలుగునష్టములు అందఱివారలకు విశదపరచి లోకక్షేమమునుకోరిన మీవల్లను, నావల్లను ఏమి యొక్క లోపమునులేకుండ కార్యము సాధించివచ్చుటయే మన పురుషకారము, మన ధర్మము. పైన దైవేచ్ఛ.

భీము: అబ్బ! ఏమీనములు లేకపోయినను యీకృష్ణుఁడు మేకపోతు గాంభీర్యముకల మాకంటె యెక్కుడు వీరాలాపములే పలికినాఁడు.

ధర్మ: కృష్ణా! మమ్మెఱుఁగుదువు. ఎదురినెఱుఁగుదువు. మంచిచెడ్డల నెఱుఁగుదువు. అర్థసిద్ధిమార్గ మెఱుఁగుదువు. సంభాషణక్రమ మెఱుఁగుదువు. ఇట్టి నీకు హితవుగఁజెప మేమెంతవారలము. క్రూరతకు నోర్వఁజాలము. నీ మఱఁదులకు గ్రాసవాసోదైన్యములు రాకుండ సిరికోరకుండనుండఁజాలను. యుద్ధమునాహ్వానింపలేను. దరిద్రమనుభవింపలేను. పగతో మసలుట ప్రమాదహేతువు. వీరూరుకొనరు. వారలీయరు. ఈ ద్వంద్వ ప్రవృత్తిని నెటుల సరిపుత్తువో నీదేభారము. అన్యులకిది దుర్ఘటము.

కృష్ణు: అంతయు దైవేచ్ఛ. సెలవొసంగుఁడు. ఓం శ్శాంతిశ్శాంతిః

(పాండవులు శ్రీకృష్ణభగవానునికి జై! అందురు.) తెర వాలును.



# మహాభారత యుద్ధము

## ద్వితీయాంకము. (కృష్ణరాయబారము)

ప్రథమ దృశ్యము. స్థలము : హస్తిపురి, ఆలోచనామందిరము.

(ధృతరాష్ట్రుఁడు, విదురుఁడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు, భీష్ముఁడు ప్రవేశింతురు)

ధృత : దుర్యోధనా! పాండవపక్షమున శ్రీకృష్ణుఁడు రాయబారిగా వచ్చుచుండెనను వార్త చేరినదికదా. ఇప్పుడు మనము చేయఁదగు కృత్యమును యోచించవలసియున్నది. ఆ కృష్ణుఁడెవ్వరిదెస సంతుష్టుఁడగునో వారికే శుభంబగు. అతనికివలయు సపర్యలొనరించి యమూల్య రత్నములఁగానుకలొసంగి యతని చూపునకు నింపునింపువానినెల్ల నిడి సంతృప్తుఁగావింపవలయు. సగౌరవముగ పంపించవలయును.

దుర్యో : (స్వగతము) తండ్రిగారి యాలోచనలో ప్రౌఢత్వము లేకపోలేదు. శ్రీకృష్ణుఁడు సంతసించులాగున, మాకోరికలీడేరు విధమున సంచరింపవలయుననియై యుండును. (ప్రకాశముగ) తండ్రీ! చిత్తము.

విదు : అన్నా! నీవునుడివినది మేలెయగుంగాని పాండవులకై దూళ్ళయిన నిచ్చుట కంగీకరించని నీ పుత్రుని శ్రీకృష్ణుని కమూల్యధనంబు లొసంగుమనుటలోగల యంతరార్థ మేమైయుండునో! లంచమిచ్చిన కంసారి మనపక్షమున వాదించునని తలంచుచుంటివికాబోలు. ఎవరేవిధముగ నడచినను శ్రీకృష్ణుని తత్వమున కన్యథాత్వము కలుగనేరదు.

దుర్యో : నాయనా! విదురుఁడు చెప్పినదియు సమంజసముగనే యున్నది. మనమేమిచ్చినను నీయకుండినను వానికినొక్కటే. అతఁడు పాండవపక్షము విడఁడు. పాండవులకుఁగాని, కృష్ణునకుఁగాని యేమాత్ర మేమియిచ్చినను నాగరికులు మనల ననదలగ జమకట్టి పాండవులకు భయ

పడినవారినిగా దలంతురు. కాన ఇచ్చుట అను మాటకూడ పాండవ పక్షమున నుచ్చరించుటయే యసమంజసముగా కనఁబడుచున్నది.

భీష్మ : బిడ్డా! ధృతరాష్ట్రా! నీవును నీకొడుకును నతనికేమిచ్చినను, నీయకుండినను నాతని సంకల్పమునకు భిన్నత్వముకలుగదు. కాన మర్యాదాతిక్రమముగాకుండ కృష్ణుని సంతసింపఁజేసి పంపిన ఆధునిక నాగరికతాప్రపంచము మనల నిందింపకుండును.

దుర్యో : తాతా! శ్రీకృష్ణుని సగౌరవముగా పంపవలయుననియే మేమును తలంచుచుంటిమి. కాని యతఁడు మితిమీరి న్యాయశాస్త్ర విరుద్ధముగా సభానియమముల నతిక్రమించిన ... ... అర్ధోక్తిలో

కర్ణు : శాసనబద్ధుని చేయక తప్పదు.

ధృత : ఇచ్చుట చట్టబద్ధమేమున్నది. శాసనోల్లంఘనమేమున్నది ? కృష్ణుఁడు మధ్యవర్తి, రాయబారి, దూత, బంధువు. కాన నిచ్చుట న్యాయము ప్రధానముకాని శాసనప్రమేయమేమున్నదిరా ? వానికి చెడ్డ తలపెట్టిన లోకమే ప్రతికూలమగును. బాగుగ నాలోచించు.

భీష్మ : అంబికేయా! అట్టికార్యమీతఁడు చేయుఁగాక, చేయక పోవుఁగాక. ఈ దుర్యోధనుని సంకల్పము మాత్రము వైపరీత్యమును సూచించుచున్నది. దీనినే సహచరులును ప్రోత్సహింతురు. దాన నష్టము వాటిల్లకమానదు.

కర్ణు : తాతగారూ! అందులకుగాను ఏమిచేయమందురు ?

దుర్యో : ఏమిచేయమందురా ? అతఁడేయాడంగిమాటలు పలికినను వినుటకు చెవులును, నిచ్చుటకు చేతులును సిద్ధముచేసికొని యుండమందురు.

ధృత : ఏమీ, కర్ణుఁడుకూడ యిచ్చుటనేయున్నవాఁడా ? ఇఁక యెందులకు ? అగ్నికి వాయువు తోడైనట్లే. రాయబారిగావచ్చెడి శ్రీకృష్ణుఁడు మేధావి. ఇట్టికుయుక్తులు వానికి లక్ష తెలియును. జాగ్రత్తగా మాత్రము నడుచుకొనుఁడు.

(తెరలో)

గీ॥ వాసుదేవ ! ముకుంద! సుస్వాగతంబు
చక్రి ! మురవైరి ! శ్రీహరి! స్వాగతంబు
ఆశ్రితావనదీక్ష ! సుస్వాగతంబు
స్వాగతము నీకు కృష్ణ ! సుస్వాగతంబు.

ధృత : (శ్రీ) కృష్ణుఁడు వచ్చినట్లున్నాఁడు. ఎదురేగి స్వాగత మొసంగుదము.

(తెర పడును)

## ద్వితీయ దృశ్యము.

శ్రీకృష్ణుఁడు, సాత్యకి ప్రవేశింతురు. ధృతరాష్ట్రుఁ డెదురుకచ్చును. కుశల ప్రశ్నానంతరము శ్రీకృష్ణుని ప్రస్తావన, బంధుమర్యాదలు నడుచును.

కృష్ణ : మామా! నమస్తే. మఱల యెంతకాలమునకీ కరినగరము చేరఁగల్గితిని. ఆనాఁడు పాండవులను ద్రుపదుపురమునుండి నీయిచ్చ మెయిఁ దెప్పించి సకలలోకకర్మసాక్షియు, నేనును, యీకురువృద్ధులును సాక్షులమైయుండ పాండురాజు విభవమంతయుఁగొనుండని ధర్మరాజును అర్ధరాజ్యమున కభిషిక్తుని జేసిననాఁడీ కరినగరమునకు వచ్చితి. మఱల యీనాఁడు ధర్మజుపుణ్యమున రాగలిగితిని. ఈనడుమ నెంతప్రయత్నించి నను రాజాలకపోతిని. మిమ్మందఱ నిప్పుడిచటఁగాంచి కృతార్థుఁడ నైతిని. ప్రతిపఁగాంచిన యీ పౌరరాజ్యలక్ష్మినిగాంచిన నా చూపులు చరితార్థ ములు. ఇప్పటి పాంచాలముకూడ యీ పౌరరాజ్యములోనిదేకదా. యాదవులమగు మా కూటస్థపురుషుఁడు యదువు పూరుని యన్న యే కదా. ఆదికాలమునుండియు మన మందఱము సన్నిహిత సంబంధము కలవారలమే. వర్ణనాతీతమగు నింతటి వైశాల్యముకల కురుసామ్రాజ్య మునకు ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన మీయన్వయము మిగుల పవిత్రమై సంస్తుత్యమైనది. మాకేరాజ్యాధిపత్యములు లేకపోయినను రాజ్యాధిపతు లును, బంధువులునునగు మిమ్ముఁజూచి చాల సంతసము నొందుచుంటిమి.

(ధృతరాష్ట్రుని నిష్క్రమణము)

కర్ణునితో దుర్యోధనుని ప్రవేశము.

తాతా! దుర్యోధనా! నమస్తే. అందఱు క్షేమమేకదా? రాజ్యము సుభిక్షమేకదా. (కర్ణుని జూపుచు) జాతిరత్నములలో నెన్నికరత్నములైన వీరరాజకుమారశిఖామణులనేర్చి కూర్చి నీనేర్పరితనమున నీకడనేయుంచుకొంటివి. వీరందఱికి క్షేమమేకదా?

కర్ణు: నమస్తే! నామమాత్రముగ మామ సింహాసనమధిష్ఠించి నను దుర్యోధనుఁడే నీవంటి వీరశిఖామణిని మిత్రునిగాఁగైకొని సమస్త రాజ్యభారము నొదలనిడెనుకదా. అట్టి మిత్రుఁడగు సుయోధనునకు సుఖము కల్పించుచుంటివికదా! అందఱు క్షేమమేకదా.

(పలుకరింపఁబడినవారలు నిష్క్రమించుచుందురు)

భీష్ముని ప్రవేశము.

తాతా! నమస్తే. నీకతమున రాజ్యభారము వహించిన వీరిచే రాజ్యపాలనము సక్రమముగా నిర్వహింపఁజేయుచున్నావుకదా. నీకుగా సంసారము లేకున్నను నీ తమ్ములబిడ్డలనే నీ బిడ్డలుగ నెంచి వారిలో వారికి కయ్యములురాకుండ కుటుంబకలహములు పెరుగకుండ రాజ్య కార్యములు నిర్వహించుచుండుట నీకే తగును. నీవలననే యింతదూర మీ యన్వయము నడచినది. బ్రహ్మవిద్యాధురంధరుఁడవై రాజ్యపాలనా ధూర్వహుండవై బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠుండవై నెగడిన నీ సచ్చరిత్ర మీ యిలాతలమున వెలయఁగలదు. క్షేమమేకదా తాతా!

ద్రోణుని ప్రవేశము.

కుంభసంభవా! నమస్తే. నీచే నస్త్రవిద్య పునఃప్రతిష్ఠితమైనది. నీ కతమునకాదే కోదండపాండితీ మహిమాన్వితులగు నీ భారతవీరవరేణ్యు లెల్లరును వెలయఁగల్గుట? అందఱు క్షేమమేకదా!

(కృష్ణుని వెనుక పాత్ర్యలయు నందరికి నమస్కరించుచుందురు.)

కృతవర్మ ప్రవేశము.

కృతవర్మా! నమస్తే. (దూరముగా తీసికొనిపోయి) మఱల మన మెన్నిదినములకు కలిసికొంటిమి. ధర్మజుని ధర్మమున నీపురమునకు

రాగలుగుటఁజేసి నిన్ను కలిసికొను భాగ్యము కలిగినది. తొల్లి మనవంశ కర్తయగు యదువు తండ్రియగు యయాతి కోరిక తీర్పఁజాలకపోవుటచే జ్యేష్ఠుఁడయ్యును రాజ్యాభిషేకము పొందఁజాలకపోయెను. యయాతి యీభరతరాజ్యమునంతను తనకనిష్ఠపుత్రుఁడగు పూరున కభిషేకమొనర్చు టచే నాతని వంశమువారలగు యీచక్రవర్తులే రాజ్యపాలనముఁగావించు చున్నారు. అనంతరము అనగా కొన్నితరములు గడచినపిమ్మట మన వంశమున నప్పటికి ప్రాముఖ్యతవహించిన మన పెద్దలు కొందఱు యమునాతీరముననున్న మధురానగరము నాక్రమించుకొని స్వతంత్ర రాజ్యస్థాపనమొనర్చి ప్రభుత్వమహత్వమునందినారు. కృతవర్మా! మనలో యదు, వృష్ణి, భోజ, అంధక, కుకుర, మల్ల తెగల భేదములెన్నియున్నను మీ భోజకులులే కదా ప్రభుత్వమునొందినారు. యదువంశోద్ధరణార్థము మనమందఱు మేకీకృతమనస్కులమై పాటుపడవలదా? మనలోమన కెన్ని భేదాభిప్రాయములున్నను స్వవంశమునకు దుర్బలము నాపాదింపరాదు కదా. కృతవర్మా ! నీయట్టి విలుకాండ్రు మన వంశోద్ధరణమునకు సంబంధములేని యీ కురుపాండవసమరమున జోక్యము కలుగఁజేసికొనుట యసమంజసముకాదా. ఇరుపక్షములవారును నా సాయము కోరగా నిరస్త్రపాణినై వచ్చితినికాని యొకరిపక్షమున నింకొకరి కెదుఱుగా అస్త్రముపూని నిలువలేదే. అస్త్రపాణివైన నీవుగాక మనలో నింకెవ ఱును యీ యన్నదమ్ములకీచులాటలో జోక్యము కలుగఁజేసికొనలేదే. యదువీరుల సంఖ్య నశింపకుండుటకును యదుప్రముఖులు సురక్షితముగ నుండుటకును యదుకులమును పరిరక్షణమొనర్చుకొనుటకుకదా నా యన్న బలరాముఁడును, నాకుమారులు సాంబాదులును ఈ కురుపాండవ సంగ్రామమున నేపక్షమును జేరక తటస్థులైయుండుట ? యదువీరులలో ప్రధానపురుషుండవును మేటి విలుకాండ్రకెల్ల గండుమగండవును నగు నీవే యిట్టులీరంగమున కుఱుకుట స్వకార్యవినాశహేతుభూతముకాదా! మనకున్న పనియేమి ? మనమిప్పుడొనర్పునదేమి ? స్వవంశోద్ధరణ దీక్షా

దక్షుండవగు నీవు స్వకార్యవిధ్వంసమొనరించి స్వకుల వినాశహేతుభూత మగు యుద్ధమునఁజొరందలఁచుట యీ సమయమున మనకొప్పనిపని. ఈ యసురసాంప్రదాయకుల మూలమున మనకేల బాములు ? నీయట్టి వానికింతకన్న వేఱేమిచెప్పఁగలను. మనబలము నశియింపని విధమునఁ బ్రవర్తించుటయే మేలు. మన సాత్యకిమాత్రము తన గురువగు యర్జును నకు గురు ఋణముఁదీర్ప యుద్ధమున సహాయముఁజేయఁబూనెను. వాని కుతూహలమును నేను కాదనలేకపోతిని. ఇంతకన్నను మన వారెవ్వరును నీయుద్ధమున పాల్గొనుటలేదు. అందఱును క్షేమముగా నుండిరికదా. (సాత్యకి నుద్దేశించి) సాత్యకీ ! నీవు మన కృతవర్మయింటికి వినితోచని భోజనాదికృత్యముల నచటనే కావించుకొని యీ రాత్రిగడపి యుదయ ముననే కృతవర్మ సహితముగా నన్ను కలసికొందువుగాక !

(సరేయని కృతవర్మతో సాత్యకి నిష్క్రమించుచును).

వి దు రు ని ప్ర వే శ ము.

విదురమహాశయా ! నమస్తే. అందఱు క్షేమమేకదా. నీ నీతి వైశద్యమే యీ కురువంశ రాజ్యస్థాపనకు మూలము. మా మేనత్త కుంతి నిరామయముగా నున్నదికదా. మా మేనత్తను చూడవలెనని మనస్సు ఉవ్విళ్ళూరుచున్నయది. విదురా ! యింటికిపోదము. అచ్చటనే భోజనపుఏర్పాటుకూడ గావింపుము. విదురమహాశయా ! నే నిపుడు కుంతిని దర్శింపవలయు నడువుము.

విదు : అట్లనే చేయుదము. నేనొసంగు అతిథేయ సత్కారములు స్వీకరించి నేటికి నాయింట విందారగించి నన్ను ధన్యునిఁజేయఁదలంచి నందులకుచరితార్థుఁడనైతిని. పత్రప్రయత్నములనుండననుమతికాంక్షించు చుంటిని. (నిష్క్రమించును).

దుర్యోధనుఁడు, కర్ణునితో పునః ప్రవేశము.

కృష్ణ : బావా! దుర్యోధనా! నాకుసెలవీయుము. విదురునింటికిఁ బోవలయును. అచట మామేనత్త కుంతిని జూడవలయు. అచటనే భుజింప

నిశ్చయించుకొంటిని. నన్ను గుఱించి మీ రేమియు శ్రమపడకుఁడు. పోయి వచ్చెద. సెలవొసంగుము.

దుర్యో : వాసుదేవా! నీరాక రాకయుంబోలె మాలోచన చకోరంబులకు పెనుపండువనొనర్చినది. అప్రియత్నముగ సమకూడిన నీయాగమనము కతమున మాయింట పండువు సేయనెంచి తదనుకూలప్రయత్నము చేయించుచున్నాను. నీకు ప్రీతికరములగు వంటకములు సేయింపఁ దొడంగితిని. మా నికేతనమున నిన్ను కలిసికొను భాగ్యమబ్బినందులకు నేను ధన్యుఁడనై తినని గర్వించుచున్నాను. నేఁడు మా కతిథివై మమ్ముఁ గృతార్థులఁ జేయుము.

కృష్ణు : నేఁడిందుల కీయకొనఁజాల. మా మేనత్త నా కొఱకెదురుచూచుచుండును. విదురునింటికే పోవలయు.

దుర్యో : (కర్ణునుద్దేశించి) అంగరాజా! వినుచుంటివా! (కృష్ణునితో) బావా! కృష్ణా ! నీయాతిథేయ భాగ్యము కోరి నిన్నిట్లు ప్రార్థింప నీవిట్లు తిరస్కరింతువని నేననుకొనలేదుసుమా! నీవు కౌరవులకు పాండవులకు సమానరూపుఁడవగు బంధువుఁడవు. అసదృశ ధర్మాచారపరుండవు. మా తండ్రికిఁ గడుంగడుకూర్పు ప్రియుండవు నగుట నిన్ను సంతృప్తి నొనర్చుటయే కర్తవ్యమనియెంచి యెంతయు నిన్నుఁగోర నీ విట్లనుటకు గతంబెఱుఁగఁజాలకున్నాను. ఈనీ వర్తనము మా కులమున కంతటికిని మచ్చ దెచ్చునుసుమా ! ఇది నీతికిని బాంధవమునకు కూడ బాహిరంబని యైన దలంపవలదా ?

కృష్ణు : సుయోధనా ! నేనిపుడు దూతను. దూత కార్యభారవహుండై యెవరికడకువచ్చునో, ఆకార్యము పూర్తి చెందువఱకు వారింట భుజింపరాదు. కతికిన వ్యాపార మతక దందురు. వారిచ్చుబట్ట కట్టరాదు. వారిడు కానుకలఁ గైకొనరాదు. ఇది ధర్మశాస్త్రవిహితము. ఇది నీకును తెలిసిన విషయమే. కార్యము తీరినపిదప మీ సత్కారములన్నిటిని స్వీకరింతును.

దుర్యో: కృష్ణా! మాయూరకరు దెంచితివి. మమ్ముఁజూడవచ్చితివి. నీవు మామూలు దూతవుకావు. బంధువుఁడవు. గౌరవమైనవాఁడవు. ఇట్టినిన్ను సగౌరవముగా ప్రత్యుత్థానంబొనరించి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి మా తండ్రి యథోచితోపచారములు గావించె. నేనును చేతనైనంతవఱకు నుత్తమభంగిగనే యర్చించితిననుకొనుచుంటిని. నీవు వచ్చితివికదా యని నాయింట పెనుపండువు చేసికొననెంచి యింతదూరము ప్రయత్నించితి. కాని నీవు మాయింట కుడువనొల్లక యిట్టే వేగిరపడితివి. ఇట్టిది నీయట్టి చుట్టమునకు కూడనిది. నీవు వచ్చిన కార్యము తీరుగాక. తీరకుండుగాక. కార్యము తెలుంగువచ్చినపుడు దాని తెలుంగునకు తగినపోలిక యప్పు డాడుకొనవచ్చు. ఇప్పుడే నీవిటు ముక్రదాట కాలు దువ్వనేల? వచ్చిన వాఁడవు నా హృదయపూర్వకంబగు ప్రార్థనమంగీకరించి మా యింట మాతోపాటు కలిసి మెలసి భోజనముచేసిన యనంతర మన్నివనులు చెప్పుటయొప్పుఁగాని యిప్పుడే యిట్లనుట భావ్యమగునే. నాయెఱిగినంత వఱకు దీనికి కారణ మరయఁజాలకున్నాను.

కృష్ణ: బావా! నన్నెవరు నీకడకు దూతగఁబంపిరో యట్టి పాండవులు కూటికై దేవుల్లాడుచుండ వారిచే ననుపరినైననేను మీయింట విందు లారగించుచు సుఖించుట నైతికముకాఁజాలదు. కాన మామేనత్తయున్న విదురునియింటనే భుజించుటకు నిశ్చయించుకొంటిని.

దుర్యో: బావా! కృష్ణా! మాకు త్రాగుడు, వ్యభిచారము, జూదము ఇట్టి దుర్వ్యసనము లలవాటులేవు. మీయన్న బలరామునివలె నీకుకూడ మద్యపాన మలవాటులేదుకదా? యాదవులు మదిరాపాన మత్తులు. ఆమద్యము మా యింటదొరుకదు. మే మందర మేకపత్నీ వ్రతస్థులమగుట వ్యభిచారమునకును మా యింట వలనుపడదు. ఏది యెట్లున్నను నీకు వలయు సౌకర్యములు మాయింట లభింపవనుకొంటివో, మఱి యేదైన దుర్భావమువహించి జాగ్రత్తపడుచుంటివో తెలియకున్నది. స్వేచ్ఛకొఱ కచ్చటికి పోవుచుంటి వనుకొనుచుంటిని. నీ యిష్టము వచ్చి నట్లు విదురుని యింటికేపొమ్ము. సెలవు. (కృష్ణుఁడు నిష్క్రమించును).

దుర్యో : కర్ణా! ఈ కృష్ణుఁడెంత విరసముగా ప్రవర్తించినాఁడు, బంధుప్రేరకుఁడాయని మా యయ్యకుఁ గడుంగూర్చు హితుఁడుకదాయని ప్రత్యేకముగా నిలుపుకొనియున్న నాయింటికి వచ్చినవాఁడుకదాయని నాయింటఁ గుడువరమ్మని కోరఁగా నేమో శాస్త్రమర్యాదలు, ధర్మసూత్రములు ఉటంకించి నా మాట నిరాకరించినాఁడు. అందరియెదుట నన్ను చిన్నగాఁజూచుటే తన ఘనతను పెంపుజేసికొనుటయని యెంచెఁ గానోపు నిట్లు ప్రవర్తించినాఁడు. ఈతఁ డెంతటి కుటిలపుటూహాలతో మనయూరు చేరెనో కాని తొలుదొల్తనే మాతండ్రియెదుట నెక్కడెక్కడి గొడవలో జెప్పమొదలిడెను. మా తండ్రి ధర్మజున కర్ధరాజ్య మొసంగినపుడు తాను నొక సాక్షిగా నుంటినని మాటల ధోరణిలో సూచించినాడు. ఇతని సాక్ష్యమెవరికి కావలయు నితఁడెవరికిఁ గావలయు. జేలతనమున మాతండ్రి మాత్రమే యితని యుబుసుపోని పలుకు లాలింపవలయు. తన వాఙ్నైపుణ్యమున తాను దినములు గడుపుకొనునుగాక. తాతలనాటి ప్రాతకథ లాలింప మాతండ్రికే చెల్లినది. వృద్ధజనులయొద్ద పుక్కిటి పురాణములఁ జెప్ప నీకృష్ణునికే తగినది. సభకు వచ్చినది మొదలు తానెవరితో నెట్లెట్లు పలుకవలయునో ఎవ రెవరినే యే ప్రసంగముల నలరఁ జేయవలయునో వెదకుకొనుచు నెంతగా ప్రసంగించినాఁడు. మా తండ్రిని మెప్పించురీతి, పితామహాదుల నలరఁజేయు పద్ధతి, ఆచార్యాదులను పొంగించు ఫణితి, చూచుకొని చూచుకొని పలికి తుదకు నన్నును మెప్పించు నెపమున నేమేమియో చెప్పినాఁడు. తనమాత్ర మెఱుంగజాలనివారమని కాబోలు నట్లారంభించినాడు. తాను వచ్చినపనికి తొలినుండియు బీజములు వేయుటయే పనిగా జూచినాఁడు. ప్రతివాదమే ప్రధానముగఁజూచి యందు కనువగు నుపపత్తు లన్వేషించుకొనినాఁడు. ఈ హేతువాదములు, ఈ గూఢార్థప్రతిపత్తు లెవనికిఁ గావలయును? నా బాల్యమున నాతండ్రియిచ్చవచ్చినట్లిచ్చివేసిన రాజ్యం బేమార్గముననైన నేమి మరల సంపాదించి కాపాడుకొనుటయే నాకర్తవ్యము. సమయోచిత

పథముఁద్రొక్కి యెట్లెట్లో నష్టద్రవ్యమును గ్రహించితి. క్షత్రధర్మమునను సరించి నన్ను గెలిచి ధరణీభాగము గై కొనవలసినదే కాని యిన్ని కుతంత్రములేల ? ఈవార్తలేల ? ఇందఱు వార్తాహరులేల ? రాజ్యము వీర భోజ్యమని యెఱింగియు నీతంతులేల ? ఎట్లయిన నీమాయలమారికృష్ణు నొకకంట కనిపెట్టుచు వీనిప్రతివాక్యమును పరిశీలింపవలసినదే. నాయింటికి వచ్చి నాయాహ్వాన మంగీకరింపకున్నమానె. కాని నన్నెంతగా చిన్న బుచ్చినాఁడు. ఇకముం దెట్లుసంచరింపఁగలఁడో చూతముగాక.

కర్ణుడు : మిత్రమా ! ఈతఁడననేల. త్రిమూర్తు లేకమై వచ్చినను ముల్లోకము లొక్కటైనను మన కేమిభయము? (తె ర వ్రా లు ను)

తృతీయాదృశ్యము. ప్రదేశము : కౌరవసభ.

(కృష్ణుఁడెత్తయిన పీఠమున కూర్చుండును. వానికిరుపక్కల సాత్యకీ కృత వర్మలాయుధధారులై అంగరక్షకులుగా నుందురు. వెనుక పీఠమున విదురుఁడుండును. ఒకపక్క యెత్తయిన పీఠమున ధృతరాష్ట్రుఁడు మఱియొకపక్క యెత్తయిన పీఠమున కర్ణ దుర్యోధనులు, ధృతరాష్ట్రుని ప్రక్కన భీష్మ ద్రోణులు, దుర్యోధనుని ప్రక్కన దుశ్శాసనుడు నుందురు.) నాట్యాదులకు సమయము. (కృష్ణుడు లేచి సభ్యులకు నమస్కరించి ధృతరాష్ట్రు నుపలక్షించి)

కృష్ణు : ఓ ధృతరాష్ట్ర మహారాజా : నీ తమ్ముని కుమారులగు పాండవులు మొట్టమొదట నీకును, యిచ్చటనున్న పెద్దలకును నమస్కరించి మీ యాశీర్వాదముల నొంది పిన్నల నాశీర్వదించి మిమ్ములఁగూర్చి చెప్పుమని నాకుచెప్పి పంపించిన మాటలుకొన్ని కలవు. అవియేమన ? మాతండ్రి పాండురాజు పోయినను మాపెదతండ్రి ధృతరాష్ట్రమహారాజే తనకొడుకులతోపాటు మమ్ములను గారాబముగఁబెంచి పెద్దవారలఁజేసెను. విచిత్రవీర్యక్షేత్ర జనితులగు ధృతరాష్ట్ర, పాండు, విదురులు, మువ్వురున్న న్యాయశాస్త్రరీత్యా రాజ్యపరిపాలనార్హులగుట మాతాత భీష్ముఁడు, వ్యాసుఁడు మొదలగు పెద్దలు, మా పెదతండ్రి సింహాసన మధిష్ఠించుటకును, మా తండ్రి దండనాథుఁడుగ రాజ్యపరిశీలన గావించుటకును విదురుఁడు ప్రధాన మంత్రిగ రాచకార్యము నిర్వర్తించుటకును, తగు

నేర్పాట్లు గావించిరి. ఇంకను నన్నదమ్ములబిడ్డలలో నెవఁడు పెద్దవాఁడో వానికి యువరాజ పట్టాభిషేకము గావించుటకును, తరువాత నతఁడే రాజగుటకును కూడ నియమమేర్పరచిరి. అటులనే అన్నదమ్ముల బిడ్డలలో పెద్దవాడగు ధర్మజునకే మా పెదతండ్రి భీష్మాదుల సమక్షమున యువ రాజ పట్టాభిషేకముఁగావించెను. అటులమేము సుఖంబుగనుండ దుర్యో ధనాదులు మమ్ములఁజంపి రాజ్యమపహరింప లాక్షాగృహ దహనాది క్రియలఁ గావించిరి. కాని దైవానుగ్రహమున మేమెట్లో బ్రతికి ద్రుపదు పురమున ద్రౌపదీ వివాహ సందర్భమున బహిర్గతులమైతిమి. మఱల ధర్మజుఁడే యువరాజుగనున్న కురు పాండుకుమారులు కలహించు కొందురని పెద్దల యనుమతిని మా పెదతండ్రి మాకర్ధరాజ్యముమాత్రము పంచియిచ్చెను. మొత్తము రాజ్యమునకే మేము సర్వాధి కారులమైనను పరిస్థితుల ననుసరించి పెద్దలుచేయు కృత్యములు కాదనజాలక అర్ధరాజ్య మునకే అంగీకరించితిమి. దానితో మేము తృప్తిపడి సుఖించుచుండ సుహృ ద్ద్యూత మొకటి కల్పించిరి. అది మాయజూదమో మంచిజూదమో యెద గుగాక. అందు మేము సర్వస్వముఁగోల్పోయితిమి. కాని అసభ్యతగా కౌరవులు పాంచాలిని జుట్టుపట్టుకొని లాగి నిండుసభలో మానభంగము గావించుచుండ మేము కళ్ళారఁజూచుచు ధర్మమునకు కట్టుబడి యూరు కొనవలసివచ్చెను. మధ్యవర్తులగు కురువృద్ధులేల యూరుకొనిరో మేమూ హింపజాలకపోతిమి. దిక్కులేని యాపాంచాలి యట్టితఱి కేవలము దైవ ముచేతనే కాపాడఁబడినది. మఱల మా పెదతండ్రి కోడలియందు కనిక రించి జరిగినదంతయు మఱచిపొమ్మని మాయర్ధరాజ్యము మాకొసంగెను. మఱల అనుద్యూతమున నట్టి మాయర్ధరాజ్యముకాక పండ్రెండు సంవత్స రము లరణ్యవాసము, ఒకసంవత్సర మజ్ఞాతవాసముగ పణముబెట్టి యోడి పోయి యట్లుసమయము నిర్వర్తించి అప్పుడు మేమొడ్డని యర్ధరాజ్యపు భాగమును మాత్రము కోరుచుంటిమి. ఈపదమూడు సంవత్సరములు మారాజ్యము వారి భుక్తములో నున్నదగుట సత్వపుహక్కు యున్న

దందు రేని అయిదుగురికి ఐదూళ్ళయిన నీయుఁడనియు, ఆ అయిదూళ్ళు 1 ఇంద్రప్రస్థము, 2 యమప్రస్థము, 3 మాకంది, 4 వారణావతము మిగిలినది యేదైనవారియిష్టమువచ్చినదే యీయవచ్చు ననియు, వానితోనే కాలక్షేపముఁజేయుచు మా పెదతండ్రి మాయందుఁజూపిన కరుణకు కృతజ్ఞతఁదెల్పుచు నుందుమనియు, లేనియెడల ప్రజానాశనకరమగు యుద్ధమున ఘోరవిపత్తు రాగలదనియు, అందిరుపక్షములవారు యెవరు చచ్చినను మిగిలిన తనకే విచారహేతువనియు, ఇంకను అక్కడనుండు పెద్దల వాగ్ధోరణి ననుసరించి ప్రవర్తించుటకు మేము సర్వాధికారములు నీకొసఁగుచున్నామనియు, దెలిపి నన్నుఁబంపిరి. మామా! నీవు నీ కుమారునకేచెప్పి యిప్పించెదవో లేక స్వతంత్రించి యిచ్చెదవో ఏదో యొకమాట చెప్పుము. ఇది నా రాయబారసారాంశము.

ధృత : యదునందనా! నీవు కార్యధురంధరుఁడవు, మేధావివి. సర్వజ్ఞుఁడవు; నీకు తెలియని విషయములు లేవు. నాకుమారుఁడు సుయోధనుఁడు యువరాజు. ప్రాజ్ఞుఁడు సమస్తవిషయముల నారితేరినవ్యక్తి. రాజనీతిజ్ఞుఁడు. నేనో అంధుఁడను, వృద్ధుఁడను, వయస్సుచే దేహముతో పాటు మనస్సునకును నొక స్థిరత్వము లేకున్నది. ఇదివరకు నాకోపిక యుండునెడ వీరికీచులాటలు తెలిసికొని యెప్పటికప్పుడు సరిజేయుచు నుండెడివాడను. ఇప్పుడు దేహమనోబలములు రెండును వశము తప్పినవి. ఏదైననొక పొరపాటు మాట విడిచితినో కొడుకుల పక్షమున నాడితినని వారును; వారిపక్షమున నాడితినని వీరును భావించుటతప్ప మఱే లాభమును చేకూరనేరదు. నీవింగితజ్ఞుఁడవు. దుర్యోధనుఁడు నీకు సమకాలికుఁడు. మీరిద్దరు యువకులు, ఏవిధముగానో వినాశము గాకుండ సరిజేయఁగలవు. ఇరుపక్షములకు సముఁడవు. సమర్థుఁడవు. నీవు సంకల్పించిన వినాశము గాకుండను చేయఁగలవు, వినాశముఁజేయఁగలవు. నీవు చేయదలఁచుకొన్న దానికి మేమెందఱమెన్ని విధముల యడ్డుపడినను నదినిరుపయోగమే. ఈకార్యభారము నీయందేవైచితి. మీ రెట్లు సంప్రదించు

కొని పనిర్ణయమునకువచ్చి యెక్కడ నిశాని వేయుమన్నను వేయుటకు సిద్ధముగా నున్నాను.

కృష్ణు : అట్లయిన మహారాజా ! యీ విషయము యువరాజునే ప్రశ్నించెద. సుయోధనా ! ఇంతవరకు జరిగిన సంభాషణ వినుచుంటివి కదా ఇందులకు నీ యభిప్రాయమేమి ?

దుర్యో : యదునందనా ! నేను ప్రాజ్ఞుండను కాక పిన్ననై యున్న తఱి తండ్రిలేని బిడ్డలని పాండవపక్షము వారలగు యీ భీష్మాది వృద్ధులు అంధుఁడగు మా తండ్రిని వలలో వేసికొని సింహాసన మధిష్ఠించియున్న ధృతరాష్ట్రమహారాజు పెద్దకొడుకునైన నేనుండ యథోచితముగ యువ రాజ పట్టాభిషేకము నాకుచేయక వీరొక క్రొత్త మార్గము త్రొక్కి ధర్మజు నేలయువరాజును జేయవలసివచ్చెనో నాకు తెలియఁబడుటలేదు. అది యెట్టిదైనను నా చిన్నతనమునజరిగిన యకృత్యముగాన ప్రాజ్ఞుఁడ నగు నేనిప్పుడు దానిని నిరసించుచుంటిని. వారికి గృహదహనాది యే యాపదలు కల్గినను వానికి మేమే కారకులమనుట సహించరానిది. ద్రౌపదీ స్వయంవరానంతరము అర్ధరాజ్యము పంచియిచ్చుట మరియుఁ బరిహాసాస్పదము. జ్యేష్ఠక్రమానుగతముగా దానంతటదే స్వరాజ్యము నాకు సంక్రమింపవలసియుండ మా తండ్రిని భయపెట్టి యటు లర్ధరాజ్య మిప్పింపఁజేసిరి. పెద్దవాఁడైన మాతండ్రి ధృతరాష్ట్ర మహారాజుండ ధర్మ జుఁడు రాజసూయయాగము చేయుట, దిగ్విజయముఁ జేయుట మఱియు హేయమైన పని. అప్పుడు మేము వారికి శత్రువులము కావలయునా ? దాసోహమనవలయునా ? ధృతరాష్ట్రుని సంతసమునకై రాజసూయ యాగముఁ జేసితిమని పైకిపలుకుట, మమ్ములఁగ్రిందుచేసి వంచించుట. ఇది చాలమోసము, నింద్యము, అధర్మము. అట్టి యకృత్యాఫలితము ననుభ వించిరోయన వారు సుహృద్ద్యూతమున నోడిరి. అట్టి ద్యూతము మొద లగు దుర్వ్యసనములు నా కలవాటే లేదు. మా మామ శకునితో నాడి ధర్మజుఁ డోడిపోయెను. ఓడిన పురుషులు రాజదుస్తులఁదీసి సామాన్య

దుస్తుల ధరింప పాంచాలి యేమేమో సభామర్యాద నుల్లంఘించి మమ్ముం దూలనాడుటకు ప్రారంభించినది. దాన మాదుశ్శాసనుఁడు సామాన్య దుస్తుల ధరింపుమని నిర్బంధింప దాని కామెగోల, పాండవ పక్షపాతుల హాహాకారములు, అగోడవకు మా తండ్రి కంగారు, ఇఁకేమున్నది? దయ దల్చి పాండవుల రాజ్యము పాండవులకిచ్చి బుద్ధికలిగి మసలుడనెను. దైవా నుగ్రహమున నా యాపత్తుతప్పినదని వారు తలఁ దడుముకొనుచుఁ బోయిరి. దానిని సామాన్యప్రజ పరిపరివిధములఁ జెప్పికొనఁ దొడంగిరి. మఱల ననుద్యూతమున మారాజ్యమపహరింప [illegible]చి ననుయ మేర్పాటు చేసి తుదకు వారి పాపకర్మ ఫలితమోయన నోడిపోయిరి. ఈ పదమూడు వత్సరములు నెట్టులోగడిపి విరాట్రాజు మొదలగు మైత్ర్యకుటుంబముల సంబంధము కల్పించుకొని పాంచాల సైన్యముల యండ జూచుకొని మా యర్ధరాజ్యము మాకీయుఁడు. లేకున్న యుద్ధము, అని బెదరించు [illegible] పదమూడు వత్సరములగుట రాజ్యము దానంతటదే [illegible]నది. ఇప్పుడైన [illegible]ల్లిమ్మనుటకోను మోసములేకపోలేదు. మాకందీ, వారణావతములు పాంచాల రాజ్యములోనివి. ద్రుపదునిచే పాండవుల కరణమీయఁబడినవి. వానిని ద్రోణుఁడిపుడనుభవించు చున్నాడు. వానినడుగుట ద్రుపదుని సంతసింపఁజేయుటకును, నాకును ద్రోణునకు మిత్రభేదము జేయుటకునై యుండును. యమప్రస్థము (కుశస్థలి) ఇది యాదవరాజ్యములోనిది. దానిని కృష్ణుఁడు శత్రువులతో బోరునపుడు మా కర్ణుఁడు బాహుబలమున సంపాదించి మా కురురాజ్య మునగలిపెను. దాని నిపుడడుగుట కృష్ణుని సంతసింపఁజేయుటకు కర్ణ నికి నాకు మిత్రభేదముఁ జేయుటకునై యుండును. ఇఁక ఇంద్రప్రస్థ మడుగుటకు రాజసూయము, మయసభ జ్ఞప్తికిఁదెచ్చుటయే. ఆనాఁడు ధర్మజుఁడుచేసినది రాజసూయ యాగముకాదు. రాజుల కసూయఁగల్గించు మారణకర్మ, సర్వనాశనకృత యుద్ధము; అది హోమగుండము కాదు. మానవమారణ హోమగుండము. ఆ యజ్ఞకలశములోనిది జలముకాదు.

మానవరక్తము. అది కుశసహిత హస్తముకాదు. ఖడ్గసహిత హస్తము. అవి యజ్ఞపుకానుకలగు మణులుకావు. ఖండితమానవశిరోమణులు. అది యాజ్యముకాదు. మానవమస్తిష్కము. అదిహోమాగ్ని ధూమముకాదు రాజ్యాహంకార క్రోధాగ్నిధూమము. అవి స్వస్తివాచక వేదమంత్రములుకావు. మానవమారణ మహామంత్రములు. అది యవభృథస్నానము కాదు. రక్తస్నానము. ఆతిలకము కుంకుమముకాదు రక్తము. అది యజ్ఞాగ్ని యెరుపుకాదు. ప్రతీకారాగ్ని ఎఱుపు. కృష్ణా! ఆ రాజసూయమందు నీ స్వార్థముకూడ లేకపోలేదు. భీమునిచే నీశత్రువగు జరాసంధుని జంపించితివి. పాండవులకు పినతల్లికొడుకు సహజమిత్రుఁడు యజ్ఞముచూడ వచ్చిన బంధువునగు శిశుపాలుని యుద్ధమందు జయించలేక సభలో నిరాయుధుఁడుగనున్నతరి పాండవుల సహకారముఁజూచుకొని చంపితివి. దాని కీపితామహుఁడు భీష్ముఁడును తోడ్పడకపోలేదు. అట్టిద్వేషాగ్ని యే యుద్ధరూపముఁదాల్చినది. నీయందలి ద్వేషము శిశుపాలవధతో పోలేదు. ప్రజలలో నస్పష్టముగానున్న హాలాహలము ఆరాజసూయయాగముతో వృద్ధియైనది. అమృతవృతముపై విషవర్షము కురిసినది. రాజసూయ యాగమున మాతండ్రిని ధిక్కరించియతఁడు సామ్రాట్టయినాఁడనుకో. కాని పరిణామము మాత్రము మరొకవిధముగనైనది. అపజయము పొందిన రాజుల హృదయారణ్యముల నసూయాగ్ని యలముకొన్నది. ఇంద్రప్రస్థముకాదు పెరిగినది అసూయ. అక్రమమగు నీయగ్రపూజదానిని మఱింతవృద్ధిచేసినది. ధర్మజుని కృత్యములకు వారి వారికి మాత్రము సంతసము కల్గినది. కాని లోకమునకుమాత్రము చీకాకుకల్గించినది. అవమానము, అసమర్థత, అస్వతంత్రత వెల్లడియైనదని పాల... నారు. రాజసూయయాగము పారమార్థిక కార్యముగా ... రాజకీయపు యెత్తుగా మాత్రము పరిగణింపబడినది. ధర్మజునిగొ డుగు ... అందరు స్నేహభావమున రాలేదు. అధికారబలమున చేరినారు. మే మెటు చేయుటకు వీలులేక యేదో యొకవిధమున సమాధానపడితిమి. ప్రభు

వులు ధర్మజు కిరీటధారణము తమ హానిసత్వమునకు కారణమైనదని బాధపడినారు. అతఁడు చూపినవినయము, ఆతిథ్యము, ధూర్త లక్షణము లుగనే పరిగణింపబడినవి. స్వాతంత్ర్యమణిని గోల్పోతిమని వీరులు బాధ పడినారు. రాజకీయవేత్త వృథా కౌగిలింపులకు సంతసింపఁజాలఁడు. లౌకి కుఁడు శరీరముతోఁగలియును కాని హృదయముతో మాత్రముకలి యఁడు. ప్రేమకానుకలు ధర్మజునియొద్దనిడి పాలకులవమానము కూడ దీసికొనిపోయినారు. రాజసూయయాగానంతరము యేసిబోటి పాండవ పక్షపాతియో సంతసించియుండును కాని లోకమంతయు క్రోధాగ్ని జ్వాలల మండిపోవుచున్నది. భగవానుఁడగు వ్యాసమహర్షి "యజ్ఞాగ్ని హోత్రము అసూయజ్వాలగదేశముమీద వ్యాపింపదొడంగినది. కాలము గర్జిల్లుచున్నది. ఇంద్రప్రస్థముపై నతర్కితయుద్ధ మేఘచ్ఛాయాతిమిర మావరించినది. దేశ దౌర్భాగ్యము ప్రతీక్షించుచున్నదికాబోలు, అని కలవరపాటుతో ననలేదా ? అట్టి యింద్రప్రస్థము కోరుటలో నెంత యేని కుట్ర యిమిడియున్నది. అప్పుడేదాడి జరుగవలసినది. కాని యుద్ధము వల్లకలుగు నష్టముగుర్తించి ప్రజానాశనముగావింప మనసొప్పక ధర్మ జుడు ద్యూతాభిలాషికాని ద్యూతనిపుణుడు కాదనిగ్రహించి జూదము నెపమున రాజ్యము లాగికొని చల్లగావారిని వనములకు సాగనంపితిమి. ఇరుపక్షములు యుద్ధసన్నద్ధమైయుండ నీ చిన్నకోరిక తీర్చనంత మాత్ర మున యుద్ధమాగదు, ఆపబడదు. మేము వారికేమిడినను అది మాయుద్ధ భీరుత్వమునే ప్రకటింమను. ధర్మశాస్త్రపద్ధతిని, జ్యేష్ఠక్రమాగతము, అవి భాజ్యము, అప్రదేయము, అగుమారాజ్యము కురువృద్ధులు మతులుచెడి పాండవపక్షపాతమున ఛిన్నాభిన్నముఁజేసిరి. ఇప్పుడు మా తండ్రి మహా రాజు. నేను యువరాజును. ఈ రాజ్యమునాది. ఇదివరకు నడచినవక్రమా ర్గములు చెల్లతగినవికావు. ఇట్టితఱి నేనేమియు నీ యనంతమాత్రమున నాదాతబిరుదమునకు భంగపాటు కలుగనేరదు. ఏమిచ్చినను నలుసు తననమే. కాన యుద్ధమే సిద్ధము. వారికి సూదిమొనమోపినంత భూమి

న్యాయసహాయంగను. ఒసంగుమనిచెప్పుటకును నెవరికిని యెట్టియధికారమును లేదు. ఇది సిద్ధాంతమే కాని దనిపైనిఁక పూర్వపక్షములకు తావులేనేలేదు.

కృష్ణుఁ : సుయోధనా! కురురాజ్యము జ్యేష్ఠక్రమానుగతము. అవి భాజ్యము. అప్రిదేయము. అనిన నేనొప్పను. ప్రతీప్రుఁడు బాహ్లికునకు కొంతరాజ్య మీయలేదా ? అదియేకదా బాహ్లీకదేశము. అజామీఢుని తృతీయపుత్రుఁడగు దుష్యంతుని సంతతివారు తొలి పౌరరాజ్యమునందొక భాగమగు పాంచాలదేశమును పరిపాలించుటలేదా ? ఇఁక యెట్లుకురు రాజ్య మవిభాజ్యము ? కర్ణునకు నీవంగరాజ్యము నొసంగలేదా ? ఎట్లు అప్రదేయము ? యయాతి పెద్దకొడుకగు యదువుగాక చిన్నవాఁడగు పూరుడుకదా రాజ్యమేలినది ? ప్రతీపుని జ్యేష్ఠపుత్రుఁడగు దేవాపికాక చిన్నవాఁడగు శంతనుఁడుకదా రాజ్యమేలినది ? ఇఁక యెక్కడ జ్యేష్ఠ క్రమానుగతము ? అట్టి వాదములకేమి కాని యుద్ధమున జయింతునని నీకాశయున్నది కాఁబోలు ! అది యెన్నటికిజరుగదు. ఘోషయాత్రాసమ యమున ఉత్తర గోగ్రహణమునాఁడు జరిగిన మీ యోటమి జ్ఞప్తికి వచ్చుటలేదా ?

దుర్యో : కృష్ణా ! ఇట్టి యప్రస్తుతముల నుచ్చరింపకుము. ఘోష యాత్రయందు మేము నిరాయుధులము. సకుటుంబముగా గోవులఁజూచు టకు వెళ్ళినప్పుడు ఆ యర్జునుఁడు తన స్నేహితుఁడగు చిత్రరథునితో మమ్మట్లవమానపరచెను. సాయుధులమగు మమ్మెవ్వరును జయింపలేరు. ఇఁక ఉత్తరగోగ్రహణసమయమున వారిని బహిర్గతులుగా నొనర్చుటకే గోవులంబట్టితిమి. పెద్దయుద్ధసన్నాహ మేమియులేదు. అర్జునుఁడు కనఁ బడుటచే సమయభంగమయ్యెనని మేమనుచుండ సమయభంగముకా కుండ పాండవపక్షపాతులెట్లనో దానిని సమర్థించిరి. మేమా తర్జనభర్జన లలో నుండ యుద్ధక్రమవిరుద్ధమగు మత్తుమందుచల్లి మూర్ఛపడిన మాతల పాగచెంగులఁగోసి యప్పుడును నట్లు పరాభవించెను. ఏమఱుపాటున గావించినవి వీరకృత్యములెట్లగునో నీ వూహింపజాలకపోవుట మా దుర దృష్టము.

కృష్ణు : సుయోధనా! నీవు నీవారల బలమునాశించుచుంటివి కాబోలు. ప్రజానాశనము కాకుండ మనమొకపద్ధతి యవలంబింతము. జూదమున నేర్పరియగు మీ మేనమామ శకునికిని నాకును జూదము కల్పించు. వాని పాచికలతో వానినే ముందెత్తువేసికొనుమనుము. ఒక క్షణములో జయాపజయములు తేలిపోవును. లేదా భీమునిజయింతునని నీ కాశ యున్న యెడల గదాయుద్ధమున మీకిరువురకు తులారణ మేర్పాటు చేయుదును. లేదా కర్ణార్జునులకైన తులారణ మేర్పాటుచేయుదము. అట్లయిన ప్రజాక్షయముకాకుండ అన్నియు సక్రమముగ నుండును.

దుర్యో : రాజ్యముచేజిక్కి రాజునైన నాకేలనయ్యా యీ బెడదలు ? గొడవలు ? ఇంట సుఖముగా గూర్చున్నవానిని ఏదో కయ్యపు సెప మిడి వీధికి లాగుచున్నావు. ఇక నేమియు యుక్తి ప్రయుక్తులజోలికి పోక సమర్యాదగాపోయి నీవారల యుద్ధమునకు గొనిరమ్ము.

కృష్ణు : ధృతరాష్ట్రమహారాజా! యువరాజుమాటల వినుచుంటివికదా! ఏమిచేయమందువు ?

ధృత : యదునందనా! నీవేమిచేయవలయునది నేను మొదటనే నిర్ణయించిచెప్పితిని. ఇక పదేపదేనన్నేల బాధ పెట్టెదవు. నీ యిష్టము వచ్చినట్లు ప్రవర్తించుము.

కృష్ణు : గంగానందనా! నేనీ సభకు యాచకుడనై వచ్చితి. పాండవులకు బిక్షపెట్టుడని వేడుటకుగాక భారతభూమికి వీరబిక్ష నిడుడని ప్రార్థింపవచ్చిన యాచకుడను. కురు పాండవపక్షములనున్న వీరాధి వీరుల నింకను కొంతకాలము బ్రతుకనిండని ప్రార్థించుచున్నాను. అంతియకాని మీకు నీతులుగఱపుటలేదు. మీ రెఱుంగనిధర్మములేవి కల వని నే నుగ్గడింపఁగలను? ఒక కుదుటికి చెందియున్న మీ రెండు శాఖల వారికి నెవరికి యాపదకల్గినను దానవచ్చు న్యూనత ననుగూడ జెందగలదు. ఇందెవ రవినీతులైనను, అధర్మపరులైనను కార్యవైషమ్యమున విపరీతపరిణామము కలిగినపుడు మనలను ప్రజలు నిందింపకపోరు. పుత్రి

వ్యామోహమున వృద్ధాప్యముకతమున నాంబికేయుఁడేమియుఁజేయ జాలకున్నాఁడు. తాతా! నీవైనసేదో యొక నిర్ణయముఁగావింపుము. పోయివచ్చెద.

భీష్మ : యదునందనా! రూపొందిన పరమాత్మవగు నీయడుగుఁదామరలుసోకుటను, ఈ రాజ్యమును, గులమును పవిత్రమైనవి. కాల మంతయుఁదీరి చేయునదిలేక ధర్మోజయతి, అని దినములు లెక్కించు కొనుచున్ననాకు నీయాజ్ఞ నెరవేర్పఁగలుగునంతటి భాగ్యమా? అంతః కలహములు చెలరేగుటతప్ప నేనిప్పుడు చెప్పిన దెవరుపాటింతురు?

కృష్ణు : ధృతరాష్ట్రమహారాజా! నీయందధికారముద్రయున్నది. నీ వేమిచేసినను జేయవచ్చు. పొరితమేయయినచో యీ యిలాతలమున కెల్ల మహాపద దాపురించును. కాన నీవించుక యోచించి, కరుణించి, యేదేనియిచ్చి సంధినొనర్పుము. నీవు చేయఁదలంచితేని వీరినిదేర్చి వారినిఁజేర్చి కూర్చినసనే సౌఖ్యమునొందఁగలవు. అట్లుఁగాక యుద్ధమేయైన కౌరవులకు పాండవులకే కాదు ముప్పు. భారతభూమియే నిర్వీర్యమై కాలక్రమమునఁ దేజోవిహీనమగు. అస్త్రవిద్యయు నడుగంటును. చచ్చిన వారు చావగా యుద్ధానంతరమున నున్నవారికే కడగండ్లు.

ధృత : నన్నేల విసిగించెదవుకృష్ణా! చెప్పవలసినదేదో యిదివరకే చెప్పితినికదా.

కృష్ణు : ఆచార్యవర్యా! నీ యభిప్రాయమేమి?

ద్రోణ : కృష్ణా! వీరపురుషులయెడ సంధి యెట్లుకుదురును? సంధికుదిరినమంచిదే. లేదా యుద్ధమేజరిగిన శిష్యుల యస్త్రవిద్యా నైపుణ్యము కనులారఁజూడఁగలను.

కృష్ణు : తాతా! గంగాపుత్రా! ఇఁక నాకు సెలవా?

భీష్మ : ముకుందా! రాగానలముమధ్య పురుషుఁడు పుటము తీరిన మేలిమి బంగారమువలె వన్నెతరుగక నిలబడవలెను. అజ్ఞానతమో సాగరమున మునిగిపోక యీదుకొనుచుఁదేలి తేజఃపుంజము దిక్కునకు

బయలుదేరవలెను. బురదనుండి చించుకొనుచు బయటికిబయలుదేరు కమలము విధమున కళంకమువీడి శోభించవలెను. మేఘమును జీల్చికొనుచు శోభించు చంద్రమండలమువలె నిష్ప్రవృత్తి కలిగి ప్రకాశించవలెను. అంతే కాని పాపగహనగర్తలోపడిన మానవునకునుద్ధరణయెక్కడిది ? మఱిశోభ యెక్కడిది? జయమెక్కడిది? ధర్మనిరతునిజీవనమార్గము సరళత్వముకలది. దానికి నలుదిక్కులు తెరువఁబడును. దానికి ప్రతియంగుళమున రాజ్యము కలదు. నియమపర్వతములుండవు. అనాయాసముగా అనుకూలపథమును బొందగలుగును. నిజవికాసముయొక్క యంతిమప్రదేశమువఱకు భయరహితుఁడై వెలుగఁగల్గును. ఎవనికి స్వార్థభావము మనస్సులోఁబుట్టుచుండునో, ఎవనికి లోభగరళము ప్రతిజీవనరములో దాగియుండునో వానికి దుష్కాలమువచ్చినపు డవి ప్రకోపించును. అట్టి విపరీతకాలమునసే మానవవినాశనమగును. జీవితము లాందోళనములు చెందును. అప్పుడు వ్యక్తి కాక హృదయములోనుండిన లోభము మాట్లాడించును. బిరుదులతో సమరసుతో మాలిన్యముకాని మానవచరిత్రయే యమృతోపమానము. అందరికినది సంతోషదాయకమే. వికసితకాలమున నరరుధిర రక్తవర్ణముతో నిర్బంధముగా రాజ్యమును స్థాపింపఁదలఁచి మానవుఁడు మానవత్వమును గోల్పోవుచున్నాఁడు. ఈ భూమి యెవరికిని నమ్ముదైన దానికాదు. జన్మసిద్ధికై యందఱికి నివాసస్థానమైనది. ఈభూమిపై పోషకరసము దాగుటకు నందరికి నధికారమున్నది. ప్రపంచములో బ్రతుకుటకు ప్రతి మానవుఁడు శంకారహితుఁడై యుండవలెను. వనస్పతివలె నాకాశములో విశాలత్వముగా పెరుగుటకే మానవులు చూచెదరు. ఏదోవిధముగ ప్రతిమానవుఁడును తన యంతిమవికాసమును వాంఛింపఁజూచును. కాని విఘ్నము లనేకములు. మానవునిదారి కనేక పర్వతము లడ్డుతగులును. ఎప్పటివరకు మానవునకు న్యాయము సులభముకాదో, అప్పటివరకు భూమిపై సుఖమెక్కడిది ? శాంతియెక్కడిది ? సుఖభాగ సమత లేనప్పుడు కోలాహలము శమించదు. సంఘర్షణ తక్కువకాదు.

సహజముగా సమగ్రముగా మానవుఁడు సుఖమునొందుటకు మార్గములు లేకపోలేదు. ఒరుల సుఖభాగము హరించుటవలన నది స్వత్వముకానేరదు. దానిని మఱచి నరుఁడు శంకాభయములఁజిక్కుపడుచున్నాఁడు. తన భోగేచ్ఛకే యాసక్తిఁజూపుచున్నాడు. వ్యక్తిగత భోగలాలసతనుండియే విషాద్రి బ్రద్దలగుచున్నది. అందులోనే యీ మానవ సమాజము గిల గిల కొట్టుకొనుచున్నది. దేవునిచే నొసంగఁబడిన సుఖములు భూమియంతట విరజిమ్మఁబడియున్నవి. వాని నెవ రనుభవింపఁగలుగుచున్నారు ? ఎంద రనుభవింపఁ గలుగుచున్నారు ? భూమినుంచి యాకాశమువరకు జలము తగ్గేదికాదు. ఈ ప్రకాశము,వాయువు, ఎప్పుడు తగ్గేవికావు. భూదేవి బంగారమును, రత్నములను, ఫల పుష్పాదులను తనబిడ్డలకొఱకే వెడల గ్రక్కుచున్నది. ఎత్తయిన పర్వతశిఖరములలో రత్నములు, అగాధమైన సముద్రములో మంచిముత్యములు, పవడములు దేవుడు మనకొఱకే దాచియుంచినాడు. మనుజున కేనూతన జిజ్ఞాసలు ప్రేరేపింపఁబడు చున్నవో బలిష్ఠములైనవానిచేత సింధుమథనము గావింపఁబడుచున్నది. బలిష్ఠమైయుండుబుద్ధి చీకటిలోకూడ వెదుకగలదు. ప్రకృతి ప్రతి నిత్యము నూతన రహస్యమును, నూతన రూపమును తెరచును. ప్రకృతి యన విభవభాండారము. కొందఱు కోరకయే సుఖములఁబొందుచు న్నారు. మానవు లందరు నొకేవిధమున సుఖములఁబొందగలిగినంత సామగ్రి దైవమీ ప్రకృతియం దుంచినాఁడు. మానవుఁడు నిమిషములో భూమిని స్వర్గముచేయఁగలఁడు. నిమిషములో శ్మశానమును జేయఁ గలఁడు. మా సుయోధనుఁడుచెప్పినట్లు యీ యుద్ధమునకు కారణము రాజసూయ యాగవీక్షణయేకాదు. బాల్యమునుంచి వయస్సుతోపాటు పెరుగుచువచ్చిన మాత్సర్యచింత. కృత్రిమపతిని నెవరును పడగొట్టలేని స్థితిలో అర్జునుఁడుకూల్చి గురుని సంతసింపఁజేయుట మొదలుకొని నేటి వర కనేకసంఘటనముల నదిబహిర్గతమగుచునేయున్నది. దాని పరిణా మమే లాక్షాగృహదహనజ్వాల. జూదము. వనవాసము. ద్రౌపదీ వస్త్రా

పహారణ కేశగ్రహణాదులు. ద్రౌపదీమానభంగ కార్యముతో నీ సుయో ధనుని మాత్సర్యము స్పష్టమైనది. సమర్థుఁడు కాన నంతవరకు హృదయమును మాలిన్యపరచు నా మాత్సర్యచింత నణచిపెట్టినాను. అట్టి దురవస్థలో ద్రౌపదికి తపోబలము చుట్టుముట్టినది. చీరచెంగు గర్వముతో కూడినదై నది. దురహంకారము నగ్నతాండవముచేసినది. నిర్లజ్జ దేశపౌరుషమును పరిశీలించినది. అందఱునోడిపోయినారు. ఆపాపకృత్యవీక్షణ మునవీరుల, సజ్జనుల, ధర్మాత్ముల దేహములతో నేలవేడినెత్తురుబుక లేదో తెలియకున్నది. మానవునికీర్తిధ్వజమే తెగిపడిపోయినది. పతులయందలి నిరాశయేకాదు, మాబోటి దౌర్భాగ్య మానవు లందరియందలి నిరాశచే ద్రౌపది దేవతలనాహ్వానించినది. మానవత్వము చచ్చినది. ఆ దినముననే యుద్ధము జరుగవలసినది. రక్తముతో పాపకళంకము కడుగఁబడి పరిశుద్ధము కావలసినది. నిర్దోషురాలగు స్వభార్య మానభంగము నిండుకొలువున పెద్దలయెదుట జరుగుచుండుటఁజూచియు, సామర్థ్యముండియు ధర్మరాజు ఉదాసీనభావమువహించుట బుద్ధిహీన వీరులకు సదియాతని ధర్మనీతి నూతనత్వమని యెట్లుగోచరించును ? ఎవరట్లూహించెదరు ? రాబోవువారుకూడ యీనింద్యకర్మకు, ఆయసభ్యతకు నప్పుడచటనున్న వారేపతుమునకుఁ జెందినవారైనను వారల నేవగించుకొనక మానరు. అది తలఁచుకొన్న మానవత్వమున్న ప్రతి వ్యక్తికి, యప్పటికి, యిప్పటికి, ఎప్పటికి రొమ్మున బాకుపెట్టి క్రుమ్మినట్లేయగును. అట్టి కులవధూటిమానము నా కంటియెదుటనే లూటీచేయఁబడినది. ఆ సంఘటనకు భూమి బ్రద్దలు కావలసినది. దిగ్గజములు క్రుంగిపోవలసినది. మేఘములు గర్జిల్లి పిడుగుల వర్షింపవలసినది. అటుల జరుగలేదు. పాంచాలిమాత్రము కాపాడబడినది. నేను చిన్నప్పటినుండి నిప్పువలె బ్రతికితిని. నా ప్రతినరమున వీరాగ్ని ప్రజ్వరిల్లుచున్నది. అనుచితదర్పమును నేను సహింపలేను. కాని యప్పు డన్యాయమును కళ్ళయెదుట చూచుచును మౌనమును వహించితిని. కడుగుటకు వీలులేని కళంకము కలిగినది. నా వీరచరిత్ర యిట్టి

దైనది. అగ్నిపై కాలూనుట, కత్తివాయిపై నడచుట, దెబ్బకు రొమ్మిచ్చుట, నవ్వుచు హాలాహలము త్రాగుట, అరచేత హారతి వెలిగించి నెత్తినియాశీర్వదించి పెట్టుకొనుట నా వీరత్వలక్షణము. కాని యట్టితటి బుద్ధిదీప మారిపోవ బలముచే చీకటిలో పరుగులెత్తితి. నా వీరత్వము పతిత్వము చెందినది. అవమానము మ్రింగఁబడినది. వివేక మంతరించినది. పిల్లలయందలి, కుటుంబమందలి మమకారమే నన్నిట్టుల భ్రష్టుని గావించినది. ఇప్పటికిని గావించుచున్నది. సహజ కవచకుండలములుగల కర్ణునిజూచి యానాడు భయపడి యూరకుంటినని లోకమాడిపోసినది కాని నన్ను భయపెట్టినది మమకారము. దానిని నెట్టలేకపోతిని. ఒప్పుచుంటిని. బుద్ధికలశములో నీ రమ్యతోపమానమైనదైనను చెడ్డ సమయములలో విషముగామారును. మానావమానముల బుద్ధి తగిన శుద్ధిగానుండదు. అది జ్ఞానాగ్నిశిఖనార్పివేయును. ఆలోచనలు మాయమగును. వస్త్రాపహరణ సమయమున నా కండ్లెఱుపెక్కవలసినది. కాని యటుల కాలేదు. స్నేహము, ప్రేమ, మమకారము నన్ను హీనునిగావించినవి. దానికితోడు నా వయస్సుకూడ కారణమైనది. అదే నన్నింత పిఱికివానిని జేసినది. యౌవనము సగర్వముగా వెళ్ళును. వృద్ధాప్యము కుంటువడుచు నడుచును. వయస్సుక్రింద వివేకము క్షీణమగును. యౌవనపుటొడుదుడుకులఁగాంచి ముసలిమనస్సు మౌనము వహించును. వృద్ధుని బుద్ధి కార్యరంగమున దుముకక భయపడుచు ననిశ్చలముగ నొడ్డున నిలబడియుండును. చేయునదిలేక తన కళ్ళయెదుట జరుగు ప్రతి చెడ్డపనిబాధ్యత దైవమునకే వదలివేయును. గడ్డిపరక కృష్ణా! యేటిత యెల్లెదురీదగలదు? రక్తవేగము తగ్గును. ఉద్దేశ్యమున్నను నేమిలాభము! శరీరమనంబులు కూడిరావు. బుద్ధివలలో వృద్ధుఁడు చిక్కుబడిపోవును. చల్లారిపోయిన తేజస్సుగల వృద్ధమతి శ్రేష్ఠమైనదా? గంతులు వేయుచున్న యౌవనగతి మంగళప్రదమైనదా? వయస్సు శ్రాంతిఁబొందినది. సమయానుకూలముగ తగిన జాబు చెప్పలేకున్నాను. అలసిన సింగము

వ్యంగ్యబాణముల సహింపకేమిచేయుదు ? ఆదర్శమును మాత్రము వెదకు చుండుదు. ఏమిలాభము ? వయస్సను కఠినమైన చక్రముమీద బుద్ధి విపశత్వముఁ జెంది తిరుగుచున్నది. పౌరుష తేజముల దొంగిలించి కాలము పోవుచున్నది. వయఃఫలిత మనుభవించుచున్నాను. మృత్యువు నా స్వాధీనములోనేయున్నది. అయినను కాలగమనమును దాని ననుసరించిపోవు వయస్సును, దాని ననుసరించిపోవు దేహ మనోబలములును నెట్లాగుదు ? ఎట్లాపగలను ? దుర్యోధనుని భవనమున నిర్బంధింపఁబడితిని. వీరత్వ మస్థి పంజరమునఁబడి కుమిలిపోవుచున్నది. కౌరవ, పాండవులకుభయులకు మేలు చేయలేకపోతిని. ద్వంద్వప్రవృత్తిని బాధపడుచుంటి. అటు ధర్మము ఇటు స్నేహము. ఈ కఠిన నిర్ణయములకు లోనుకావలసివచ్చినది స్నేహమునకు దేహము, ధర్మమునకు హృదయము నర్పింపఁ దలఁచుకున్నాను. కుండ బద్దలైనప్పుడుకాని యందుండు జ్యోతి యేలాగు బహిర్గతము కాఁగలదు ? ఇచ్చట స్నేహప్రవాహ ముప్పొంగి ప్రవహించుచున్నది. అయినను నది ధర్మమున పరాజయము నొందుచునేయున్నది. ప్రస్తుతము స్నేహమునకే విజయశంఖా మ్రోగించుచున్నది. స్నేహమునకు దేహము, ధర్మమునకు హృదయమని చెప్పియుంటినికదా. తుదకీ దేహ హృదయములు రెండును నొకచోట సమసింపవలసినవే. నేను వయస్సువల్ల కాలము వల్ల పడవలసినవాడనేకాని ఎవనియొక్క యెట్టివానియొక్క యే శరీర బలమువల్లను నేను పడను. నాకు ధర్మము, నీతి, జ్ఞానము తెలియును. ఏమిలాభము ? ఈ దుర్యోధనునిచే పరాధీన కారాగారమున నిర్బంధింపఁబడి చేతులు ముడుచుకొని కూర్చుండవలసివచ్చినది. జీవితమును బుద్ధి శాసింపవలయును. హృదయమనుసరింపవలయును. కాని యట్లు జరుగుటలేదు. బాహాటముగా చెప్పుటకు భయమడ్డుతగులుచున్నది. ఇటు శాంతిస్వప్నము. అటు యుద్ధస్వప్నము. ఇందు పరులెవరు? నా వారెవరు? పోనీ అరణ్యమునకు తపమునకు పోదమన్నను నా వీరత్వమే నన్నడ్డుకొనుచున్నది. పోనీ వీరత్వమునకే యుంకించెదనన్న ధర్మమడ్డుతగులు

చున్నది. కృష్ణా! ఇట్టి ప్రపంచప్రవృత్తి నిపడియున్న నేనేమి చేయఁగలను? వయస్సుచే క్రుంగియున్న యీ ధృతరాష్ట్ర ద్రోణ విదురాదులు మాత్ర మేమిచేయఁగలరు ? ఇంతకన్న నేను చెప్పవలసినదేమున్నది ? కృష్ణా!

(అని కూర్చుండును)

కృష్ణు : ఓసభ్యులారా! ఎవరును నేమియుఁజేయలేకున్న నిఁక నా తుది సందేశము వినుఁడు. ఒక కుటిల నీతిజ్ఞుని వ్యవహారముసఁ గోట్ల కొలది నవయువక రక్త స్రవంతి ప్రవహించవలసినదేనా ? ఆకారము మాత్రముగొప్పది. హృదయము కేవలము మాలిన్యము చెందినదియగు నీచప్రభువులవలన దేశరక్షణమునకు మాయగ దేశనాశనము గలుగుచుండఁ జూచుచు నూరకుండుట దేశద్రోహముకాదా ? దేశ గౌరవము, జాతి గౌరవము, నవయువకశిరచ్ఛేదన బలిమాత్రమునఁగాని నరిపడదా ? ఆ దేశ జాతి గౌరవమునిలుచుటకు మఱొక సుస్థిర యాధార శాంతిపీఠము లభింపదా? దేశమాత గౌరవమునకు దేశమాత పుత్రుల రక్తబలిదానమా? దేశగౌరవభారము దేవుని కేవిడిచి కుటిలనీతిజ్ఞుని ద్రోహాగ్ని చల్లార్చుటకు నా కుటిలవ్యూహ గరళ కాలభుజంగము శిరస్తాడనమునకు వీరు లుంకింపఁ గూడదా ? దేశపరిపాలన నెపంబున ప్రజల శాసనబద్ధులఁగావించి కత్తి ఝుళిపించి స్వార్థపరత్వ, భోగలాలస, అసభ్యతావిధుల సంచరించుట యేనా యీనాటి నాగరికతకగ్రస్థానము ? పేద మానవజీవులలో జఠ రాగ్ని మండుచుండ పాలకుల హృదయపాథోధిఁ గుటిలనీతి బడబానలముభి వృద్ధి చెందవలసినదేనా ? విశ్వకళ్యాణమునకుపకరించు మానవహృదయా లలో విశ్వమారణభూతమగు ద్రోహాగ్నియా ప్రజ్వరిల్లుట ? విషభూయిష్ఠ మానవవ్యక్తి హృదయాంతరాళమునుండి బయలుదేరు నావేడి నిట్టూ ర్పులగ్నిజ్వాలాయుత ధూమరేఖలుకావా ? వ్యక్తిగతద్వేషము సమాజ మునకు నష్టమా ! ఒకేవ్యక్తిసౌభాగ్యకాంక్ష ప్రపంచ మారణహేతువు కావలసినదేనా ? యుద్ధమునకు ముందు వ్యక్తుల మనఃప్రవృత్తులు

శాంతిని ప్రబోధించుచున్నను మారణమునకు ముందంజవేయుచు నిట్టి ద్వంద్వప్రవృత్తిని డోలాయమానము కావలసినదేనా? అన్యాయము. అవమానము. ఇట్టిద్రోహములకు నేటి నాగరికతాప్రపంచములో అస్త్రమేనా గుణపాఠము నేర్పునది? వద్దనుకొన్నను యుద్ధములు తప్పుట లేదు. శాంతియని యేడ్చుటయు మానుటలేదు. దీనిని సంస్కరించుటకు వ్యక్తిగతనీతియా? సామాజికగత నీతియా? లేక మానవాతీతమగు దైవేచ్ఛయా? పరాజయవ్యక్తిచరిత్రి ప్రాపంచిక పురాణమునుండి పుట తొలఁగింపు కాబడినను విజేతకైనను యుద్ధానంతరమువచ్చునవి స్వచ్ఛ జలయుక్త ఆనందబాష్పములా? పంకసలిలదుఃఖబాష్పములా? విశ్వకల్యాణముఁగూర్చు సత్యమునకు ధర్మమునకు తగులుదెబ్బకు ప్రతిక్రియ విశ్వమారణమేనా? వీణపై నపరిచితుని హస్తమువలె సంశయు నయోమయము కావలసినదేనా? ప్రతివ్యక్తికి మంచితెలియుచున్నది. కాని సమాధానముదొరుకుటలేదు. హృదయప్రతిధ్వని తుదకు మానవహృదయము శిలాభూయిష్ఠమని స్పష్టపడుచున్నది. యుద్ధమువలన పరాజితుఁడేడ్చిచచ్చును. విజేత బ్రతికి యేడ్చును. ఇం దెవనిది సుఖము? ఎవనిది కష్టము? ఒకనినిఁగూర్చి పలువురు (విశ్వము) నాశనముజెందుచున్నపు డాపలువు రేకమై యాయొక్కని నేలమట్టుబెట్టకూడదు? ఇది అసాధ్యమా? అనివార్యమా? అందఱును జచ్చినవెనుక మిగిలినజీవు లేమనుకొనునది చచ్చినవారు వినరుకదా? మంచి చెడ్డలు, కష్టసుఖములు మిగిలి బ్రతికియున్నవారివే. ఒక్క కంసునివలన మా వంశము కంటకభూయిష్ఠమై లోకనిందనొంది యన్యోన్య కలహముల వంశనాశనమగుననుకొనుతఱి నట్టి మామేనమామయగు కంసుని బంధువని తలంపక నేలఁబాతిబెట్టి వంశము నిష్కంటకముఁజేసి ప్రజల మానప్రాణముల నేను గాపాడలేదా? ఎవనివలన నీలోకనాశనమగుయుద్ధము ప్రవేశింపఁబోవుచున్నదో పెద్దలమాటలువినని యట్టిమూర్ఖునినేల మట్టుపెట్టి లోకకల్యాణముచేకూర్చకూడదో నాకు బోధపడకున్నది.

దుర్యో : (రహస్యముగ) కర్ణా! ఈకృష్ణుని వాగ్ధోరణి రాను రాను శ్రుతిమించి రాగానపడుచున్నది. ఇట(దేమో తన్నుసమర్ధునిగను నితరుల నసమర్ధులగను జెప్పుచు తడిపొడిమాటల నీవృద్ధుల నాకర్షించి వారిచే నన్నేదియో చేయించి తనకార్యము నెరవేర్చుకొన(జూచుచున్నాడు. సభామర్యాదకూడ నుల్లంఘించి పేలుచున్నా(డు. వీనిని నిర్బంధించి కారాగారమున బంధించిన రెక్కలు పెరికిన పక్కివలె ధర్మజు(డు చేయునదిలేక యేనట్టడవికో పోవును. మిగిలినవారును చెట్టుకొక పిట్టగ నట్టులనేపోవుదురు. మీరలు దానికితగిన ప్రయత్నములనుండుడు.

**(కృష్ణుని బంధించు ప్రయత్నమున కర్ణ దుశ్శాసనులును, రక్షించుప్రయత్నమున కృతవర్మ సాత్యకి, విదురులును ప్రయత్నింతురు.)**

కృష్ణు : సభ్యులారా! మీ రెట్లు కృతనిశ్చయులైరి ?

దుర్యో : యాదవా! చాలు నీ వాచాలత్వము. ఇక కట్టిపెట్టు. ఊరకున్నకొలది పెచ్చుపెరుగుచున్నావు. నీవునన్నుచేయునది, మేము నిన్నుచేయునది క్షణములో తెలిసికొన(గలవు.

విదు : అన్నా! ఆంబికేయా! నీకొమరు(డగు సుయోధను(డశక్తిదుర్జనత్వము(జూప(దల(చినట్లు కన(బడుచున్నది. వారింపుము. లేదా క్షణములో సర్వనాశనము కా(గలదు.

దుర్యో : దాసీపుత్రా! విదురా! అప్రస్తుతముగనేదియువక్కాణింపక కుక్కినపేనువలె కూర్చుండుము. ఈ మహాసభకు నిన్నెవరురమ్మనిరి? నిన్నాలోచన నెవరడిగిరి ? ఈ కృష్ణునిపాటకు తాళమునేయువారు, వంతపాటపాడువారు లేరనినేను భావించుటలేదు. పాండవపక్షపాతులగు మీమూలముననే కౌరవ వంశమునకిట్టిచేటు మూడినది. ఎవ్వరికిని నిందుపాల్గొనవలసిన యవసరము కనబడదు. సగౌరవముగ నూరకొను(డు.

ధృత : ఏమిటిది సుయోధనా! యీ యాగడము ?

**(బంధించ ప్రయత్నింతురు. కృష్ణు(డు తన ప్రభావముచూపును. అజ్ఞానులు నిశ్చేష్టితులగుదురు. జ్ఞానులుప్రార్థింతురు).**

కృష్ణు : సుయోధనా ! నీవు చేయ తలపెట్టిన దేదో చేయుము. నీ వేమియుఁ జేయజాలవు. నేనే సమస్తముఁ జేయగలను. సభ్యులారా ! ఇఁక సంధిచెడినట్టేకదా. రేపేయుద్ధము. మీమీ సన్నాహములనుండుడు. సుయోధనా ! ఈ భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, అశ్వత్థామాది మహావీరు లఁగాంచి యాశ పడుచున్నావు కాబోలు. ఉత్తరగోగ్రహణమునాఁడు ప్రయోగించిన సమ్మోహనాస్త్రమువంటి యనేకదివ్యాస్త్రములు విజ యునియొద్దకలవు. పరమాణుశక్తివలన తయారైన పాశుపతాది దివ్య మారణాయుధము లనేకము స్వర్గమునుండి కొనిరాఁబడినవి. పుష్యమీ నక్షత్రగతుఁడగు చంద్రుఁడు చైత్రయాత్ర గావించునట్లు నా సారథ్యముచే నడపఁబడు విజయునిరథ మప్రతిహతముగ ప్రయాణముచేయఁగలదు. బహునాయకత్వముకల మీ కౌరవసైన్యము పదకొండక్షౌహిణులైనను ఏకనాయకత్వముకల పాండవుల యేడక్షౌహిణీసైన్యమునకు తీసికట్టు. మఱియొకసారి నాతుదిసందేశముపలికి సెలవుఁ గైకొనెద. సభ్యులారా ! ఇట్టి నిండు కొలువననే యిట్లధర్మము వెల్లివిరియ ధర్మదయాజ్యోతులిఁకెప్పుడు వెలుఁగును ? ఆ జ్యోతులవలన నీభూ మిఁకెప్పుడు ప్రకాశించును ? శాంతి యమృతతుషారమున ప్రాణములిఁకె ప్పుడు తడపఁబడును ? ఋషు లమృతవాగ్ధార లీభారతవర్షమునఁ గురి పించిరి. కాని అగ్ని చల్లారుటలేదు. నిప్పులవర్షములు కురియుచునే యున్నవి. ఇఁకమండుటయే కాని చల్లారుటెప్పుడు ? భోగలిప్స కంతమే కనఁబడుటలేదు. అసహాయసరుని నిష్కామభావన వ్యాపించుచునే యున్నది. యుద్ధప్రవృత్తిసమయముల నీభీష్ముఁడుకాని, ధర్మజుఁడుకాని తుదకు దైవముకాని తలయొగ్గక తప్పుటలేదు. తనకంటె యభిమానమే శ్రేష్ఠముగ కనఁబడుచున్నది. కేవలము మాటమాత్రమునకే గౌరవము. పరుని దహించి దుఃఖమును ద్రమింగుచు మానవుఁడు పురాతనమార్గమునే పట్టుచున్నాఁడు. ఎప్పటికప్పుడు పీడనము, అపహరణము, కుత్సితము నడచుచునేయున్నవి. ఫలనాశనమేనా ? తనయభివృద్ధి ? స్వాంత వ్యవహా

రము మానవుఁడు సచ్ఛీలముతో నడువలేకపోవుచున్నాఁడు. ఉండియుండి పిచ్చెత్తి కత్తివాయిపై నడచుచున్నాఁడు. అనురాగము ద్రోహభూయిష్ఠము. ప్రాణములో ప్రాచీనము గర్జిల్లుచునే వసించుచున్నది. ప్రాచీనము కంటె యాధునికమిఁక చెప్పనక్కరలేదు. అనేక వెఱ్ఱితలలవేయుచున్నది. ఇది విజ్ఞానయుగము. పరిపూర్ణము, సమర్థము, అని యెప్పటి కప్పుడే చెప్పుకొనుటయే కాని యజ్ఞానమే స్పష్టము. అజ్ఞానతమోజల తరంగములఁ జీల్చుచు బుద్ధి తెరచాపనెత్తికొని విజ్ఞానసౌక జ్యోతిర్మయ భూమికిఁ జేరవలయు. నేటి ప్రపంచము విచిత్రతమము. ప్రకృతివిజయము మానవుఁడు సాధించుచున్నాఁడు. నీటిని కట్టివేయుచున్నాఁడు. మెఱుపును బంధించుచున్నాఁడు. దానివలన తనకు సమస్తోపచారములు జేయించుకొనుచున్నాఁడు. గాలిని మూటకట్టుచున్నాఁడు. ఈ నాఁడు ప్రకృతి మానవునకు దాసియైనది. నేటి మానవుని గుప్పిడిలో దిక్కాలము లిముడుచున్నవి. ఈ యభ్యున్నతి యంతులేనిదగుచున్నది. భూగోళము చరణతలమున నణగఁద్రొక్కఁబడుచున్నది. ఖగోళమును మించి శిరమందలి యూహా లూర్ధ్వగతము లగుచున్నవి. మెదడు పెరుగుచునే యున్నది కాని కావలసిన బుద్ధివికాసములేదు. హృదయముతప్ప బుద్ధి పనిచేయుటయేలేదు. నరుఁడు మాత్రము నూతన బుద్ధివికాసమునకు ముందంజవేయుచునేయున్నాఁడు. కాని బుద్ధికధిదేవతయగు దైవము దుఃఖించుచున్నది. త్యాగము, ప్రేమ, దైవముకోరేవి. మనస్సు పాదరసమువంటిది. అది తాపమునకు ఛిన్నాభిన్నముకాగలదు. జ్ఞానమరు భూమిలో ప్రాణపుష్పములు పుష్పించి నిష్ఫలముగా, నిరుపయోగముగా రాలిపోవుచున్నవి. మానవుఁడెన్ని సుఖసాధనములు కల్పించినను మనస్సు ప్రకృతిశోభదగ్గఱనే విశ్రాంతినొందుట సహజము. కాని మానవ కల్పితవిజ్ఞానము ముందు మనస్సు విశ్రాంతిఁగనుటలేదు. కర్మసంకుల లోకజీవనమునుండి విశ్రాంతిని మనస్సు ప్రకృతిచే పొందుచున్నది. సుఖ భావమునకు మానవదేహ ముత్కృష్టత కలదియేకాని మనోగేహము

లఘుత్వముకలది. మానవుఁడు కాలమునకు దాసుఁడు. అయినను ప్రకృతిరహస్యము తెలిసికొని సముద్రముమొదలాకాశమువఱకు నన్నిటిని భయపెట్టుచున్నాఁడు. సృష్టిని తన తెలివితేటలచే నాట్యము చేయించుచున్నాడు. అజేయము, అసీమ అయిన పరమాణుశక్తినికూడ చీల్చుచున్నాడు. బుద్ధిగాలిలో నసహాయుఁడై యెగురుచున్నాడు. నిరుపాయుఁడై యెటకోపోవుచున్నాడు. లక్ష్యమేమిటో, ఉద్దేశ్యమేమిటో తెలిసికొనలేకపోవుచున్నాడు. విజ్ఞానశ్రమ వ్యర్థమగుచున్నది. గ్రహనక్షత్రముల కొలతలాకాశమునకెక్కి తీయుచున్నాడు. ఆకాశగుణకమగు పలుశబ్దములు యంత్రసహాయమున వినుచున్నాడు. కాని తనకు తానే యాహారమగుచున్నాడు. బుద్ధిలో నాకాశపుష్పపరిమళము, శరీరములో రక్తపుబురద వాసన. మాటకు దేవత, కర్మకు పశువు. మానవునిచేతినిజూచి పరమాణువు కంపించుచున్నది. బ్రహ్మాండము తారుమారగుచున్నది. అంతయు తెలిసినట్లే కనబడుచున్నది. అన్నియు నడ్డంకులే. చదివిన గ్రంథములు జ్ఞానమిచ్చుటలేదు. భూగోళము కరతలామలకమైనది. నరప్రజ్ఞ గమనశాలి. నరునకెప్పటికప్పుడే విస్తీర్ణజగము నూతనత్వము కావలసియుండును. నరబుద్ధి నిట్టూర్పుతో గుటకలు వేయుచుండును. నరుఁడు కోరేది పెద్ద జగత్తు, పెద్ద ఆకాశము. నరునకు భూగోళము చిన్నది! నూతన గ్రహాన్వేషణము, కుజబుధగ్రహములతో సంబంధకాంక్ష దీనికి నిదర్శనములు. బ్రహ్మాండముకంటె నరుఁడు విశిష్టుఁడు. భూమ్యాకాశములు నరునకు దాచబడుటలేదు. చరాచరములన్నియు నరునికి భక్తియుతముగా ప్రణామములు చేయుచున్నవి. జ్ఞానాజ్ఞానములకు నరుఁడు కేంద్రము. సృష్టిని శృంగారమయముగా, మాంగళ్యయుతముగా తయారుచేసియానందించనూగలఁడు. పశువునవలె ప్రవర్తించి హింసారక్తపిపాసలతో బుద్ధిదానవి యభిమానము రేకెత్త మృత్యుదేవత ను సమీపించి సృష్టిని సర్వనాశనముఁ గావించి పలుకష్టముల నేడ్వనూ గలఁడు. మనుజుఁడు విజ్ఞానియేయగుగాక. నక్క, కుక్క, గాడిద, పంది

కంటె హీనుఁడై భ్రష్టుఁడగుచున్నాఁడు. కేవలము దేహమే దెబ్బలాడదు. అందు మనః ప్రాణములును పాల్గొనును. ధ్వంసమునే వాని కళాపరిజ్ఞానము వెంబడించుచున్నది. నరునిచేతిలో విజ్ఞాన పుష్పములు పుష్పించినవి. మనుజులంటే మేమే యనుకొని పొరపాటుపడవద్దు. కృత్యములనే విచారించుకొనుఁడు. నరకల్పన పచ్చిమోసము. మానవజాతియే కళంకము. అంతయును విశదమేయనును. కాని శ్రేయస్సును మాత్రము గమనించదు. సీమారహితప్రేమ శ్రేయస్సుఁ దెలియలేక పరస్పరమునకు మధ్య పరదా కల్పించుకొనుచున్నది. ఏ మానవుఁడు బుద్ధిచే నధీరుఁడై పరమాణువును భేదించుచున్నాఁడో అతఁడీవజ్రతుల్యమగు పరదాను భేదించలేకపోవుచున్నాఁడు. భ్రాంతినిపడి మనుజుఁడు గ్రుడ్డివాఁడగుచున్నాఁడు. ఇట్టివానికంటె పుట్టుగ్రుడ్డియే మేలు. భ్రమితప్రజ్ఞ యింద్రజాలమువంటిది. సుయోధనా ! విజ్ఞానమునకు ఖడ్గము సాధనముకాదు. దానిని పాఱవేయుము. స్మృతిని దెచ్చుకొమ్ము. కత్తి నీకు పనిచేయదు. దాన నీకేనష్టము. మానవాయువు మానవునకే సమర్పణమగును. అప్పుడు కంటి నీటిధారే శ్రేయస్సు. బ్రిద్దలైన వీణానాదమువలె వాని పిలుపు పరిగణింపఁబడును. నరబుద్ధి శివరూపము. దానికి ప్రకృతి దాసోహమై సుఖసమృద్ధి కల్గించును. సామ్యవాదము, స్నిగ్ధము, ఉదారమునైనది. అది యెపుడు వికసించునో, కోమలజ్యోతిచే నదియెపుడు ప్రకాశవంతమగునో, మండుచుండెడి యీభూమి యెప్పుడు రసయుక్తమగునో, దైవమా! అంతయు నీ సంకల్పము. సభ్యులారా! సెలవు. విదురమహాశయా లెమ్ము. మేనత్తనుచూచిపోదును. సుయోధనా! రేపే యుద్ధప్రారంభము.

కర్ణుని చేయిపట్టుకొని శ్రీకృష్ణుని ప్రవేశము. (తెర పడును)

కృష్ణు : బావా! కర్ణా ! నేనొక్కటి చెప్పుచున్నాను విను. నీవు రాధేయుఁడవుకావు. కౌంతేయుఁడవు. కుంతికి చిన్నతనమున సూర్యునివలన మంత్రపరీక్షార్థము ధర్మజాదులట్లు నీవును జనించితివి. లోకభీతిని నామె నిన్ను గంగనువిడువ రాధ నిన్ను పెంచినది. ధర్మజాదులు నీ తమ్ములు.

లఘుత్వముకలది. మానవుఁడు కాలమునకు దాసుఁడు. అయినను ప్రకృతిరహస్యము తెలిసికొని సముద్రముమొదలాకాశమువఱకు నన్నిటిని భయపెట్టుచున్నాఁడు. సృష్టిని తన తెలివితేటలచే నాట్యముచేయించుచున్నాడు. అజేయము, అసీమ అయిన పరమాణుశక్తినికూడ చీల్చుచున్నాడు. బుద్ధిగాలిలో నసహాయుఁడై యెగురుచున్నాడు. నిరుపాయుఁడై యెటకోపోవుచున్నాడు. లక్ష్యమేమిటో, ఉద్దేశ్యమేమిటో తెలిసికొనలేకపోవుచున్నాడు. విజ్ఞానశ్రమ వ్యర్థమగుచున్నది. గ్రహనక్షత్రముల కొలతలాకాశమునకెక్కి తీయుచున్నాడు. ఆకాశగుణకమగు పలుశబ్దములు యంత్రసహాయమున వినుచున్నాడు. కాని తనకు తానే యాహారమగుచున్నాడు. బుద్ధిలో నాకాశపుష్పపరిమళము, శరీరములో రక్తపుబురద వాసన. మాటకు దేవత, కర్మకు పశువు. మానవునిచేతినిజూచి పరమాణువు కంపించుచున్నది. బ్రహ్మాండను తారుమారగుచున్నది. అంతయు తెలిసినట్లే కనబడుచున్నది. అన్నియు నడ్డంకులే. చదివిన గ్రంథములు జ్ఞానమిచ్చుటలేదు. భూగోళము కరతలామలకమైనది. నరప్రజ్ఞ గమనశాలి. నరునకెప్పటికప్పుడే విస్తీర్ణజగము నూతనత్వము కావలసియుండును. నరబుద్ధి నిట్టూర్పుతో గుటకలు వేయుచుండును. నరుఁడు కోరేది పెద్ద జగత్తు, పెద్ద ఆకాశము. నరునకు భూగోళము చిన్నది! నూతన గ్రహాన్వేషణము, కుజబుధగ్రహములతో సంబంధకాంక్ష దీనికి నిదర్శనములు. బ్రహ్మాండముకంటె నరుఁడు విశిష్టుఁడు. భూమ్యాకాశములు నరునకు దాచబడుటలేదు. చరాచరములన్నియు నరునికి భక్తియుతముగా పరిణామములు చేయుచున్నవి. జ్ఞానాజ్ఞానములకు నరుఁడు కేంద్రము. సృష్టిని శృంగారమయముగా, మాంగళ్యయుతముగా తయారుచేసియానందించనూగలఁడు. పశుప్రవర్తించి హింసారక్తపిపాసలతో బుద్ధిదానవి యభిమానము రేకెత్త మృత్యుదేవతను సమీపించి సృష్టిని సర్వనాశనముఁ గావించి పలుకష్టముల నేద్వనూ గలఁడు. మనుజుఁడు విజ్ఞానియేయగుగాక. నక్క, కుక్క, గాడిద, పంది

కంటె హీనుఁడై భ్రష్టుఁడగుచున్నాడు. కేవలము దేహమే దెబ్బలాడదు. అందు మనఃప్రాణములును పాల్గొనును. ధ్వంసమునే వాని కళాపరిజ్ఞానము వెంబడించుచున్నది. నరునిచేతిలో విజ్ఞాన పుష్పములు పుష్పించినవి. మనుజులంటే మేమే యనుకొని పొరపాటుపడవద్దు. కృత్యములనే విచారించుకొనుఁడు. నరకల్పన పచ్చిమోసము. మానవజాతియే కళంకము. అంతయును విశదమేయగును. కాని శ్రేయస్సును మాత్రము గమనించదు. సీమారహితప్రేమశ్రేయస్సుఁ దెలియలేక పరస్పరమునకు మధ్య పరదా కల్పించుకొనుచున్నది. ఏ మానవుఁడు బుద్ధిచే సధీరుఁడై పరమాణువును భేదించుచున్నాఁడో అతఁడీవజ్రతుల్యమగు పరదాను భేదించలేకపోవుచున్నాఁడు. భ్రాంతినిపడి మనుజుఁడు గ్రుడ్డివాఁడగుచున్నాఁడు. ఇట్టివానికంటె పుట్టుగ్రుడ్డియే మేలు. భ్రమితప్రజ్ఞ యింద్రజాలమువంటిది. సుయోధనా ! విజ్ఞానమునకు ఖడ్గము సాధనముకాదు. దానిని పాఱవేయుము. స్మృతిని దెచ్చుకొమ్ము. కత్తి నీకు పనిచేయదు. దాన నీకేనష్టము. మానవాయువు మానవునకే సమర్పణమగును. అప్పుడు కంటి నీటిధారే శ్రేయస్సు. బద్ధలైన వీణానాదమువలె వాని పిలుపు పరిగణింపఁబడును. నరబుద్ధి శివరూపము. దానికి ప్రకృతి దాసోహమై సుఖసమృద్ధి కల్గించును. సామ్యవాదము, స్నిగ్ధము, ఉదారమునైనది. అది యెప్పుడు వికసించునో, కోమలజ్యోతిచే నదియెప్పుడు ప్రకాశవంతమగునో, మండుచుండెడి యీభూమి యెప్పుడు రసయుక్తమగునో, దైవమా! అంతయు నీ సంకల్పము. సభ్యులారా! సెలవు. విదురమహాశయా లెమ్ము. మేనత్తనుచూచిపోదును. సుయోధనా! రేపే యుద్ధప్రారంభము.

కర్ణుని చేయిపట్టుకొని శ్రీకృష్ణుని ప్రవేశము. (తెర పడును)

కృష్ణు : బావా! కర్ణా ! నేనొక్కటి చెప్పుచున్నాను విను. నీవు రాధేయుఁడవుకావు. కౌంతేయుఁడవు. కుంతికి చిన్నతనమున సూర్యునివలన మంత్రపరీక్షార్థము ధర్మజాదులట్ల నీవును జనించితివి. లోకభీతిని నామె నిన్ను గంగనువిడువ రాధ నిన్ను పెంచినది. ధర్మజాదులు నీ తమ్ములు.

కావలసిన సూర్యభగవానునిచే సాక్ష్యము నిప్పింతును. (ఔను. ఔను. అని తెరలో ధ్వని) కాన నీవు కౌరవులనువీడి పాండవపక్షము వహించి కౌరవుల జయించి సమస్తరాజ్యమునకు పట్టాభిషిక్తుడవ్వకమ్ము. నీకు ధర్మజుఁడు ఛత్రముఁబట్టును. భీమార్జునులు వింజామరలు వేయుదురు. నకుల సహదేవు లూడిగములఁ గావింతురు. మఱియొక రహస్యము- అయిదుగురికి ధర్మపత్నిగానున్న పాంచాలియు నిన్నాఱవ భర్తగా వరించఁగలదు. కౌరవులు నిన్ను హేళనగాఁజూచుటయేగాక నామేనత్త కొడుకు వగుటచే నామనస్సు మిక్కిలిగ నెరియుచున్నది. భీష్ముఁడు నిన్నర్ధరథుఁడని క్రుంగఁదీసెను. ద్రోణాది బ్రాహ్మణులు నిన్ను సూతపుత్త్రుఁడ వనియు నీచకులస్థుఁడవనియు నిరసించుచున్నారు. తుదకు నీకుఁ బ్రాణమిత్త్రుఁడగు సుయోధనుఁడును నీకు మహాదాతయను పేరువచ్చుటకు నసూయఁజెంది తానే మహాదాతనన్నటుల వాకిట గంటకట్టినాఁడు. నీవు కౌరవపక్షమునుండి యర్జునుని జయించుటయన్న కలలోనివార్త. అతఁడీశ్వరుని జయించి పాశుపతముఁగొన్న లావరి. బావా! నీ శ్రేయస్సుకోరియే యిటు చేతులుపట్టుకొని ప్రార్థించుచున్నాను. రా పోదము. తప్పులున్న క్షమించి యంగీకరించు.

కర్ణు : నందనందనా! బావా యని సంబోధించినప్పుడే నీ భావమును గ్రహించితి. కుంతికిపుట్టనీ, యేశకుంతమునకుపుట్టనీ నాకు భార్యతప్ప యితరస్త్రీలందఱుఁదల్లులే. అర్జునునియందు పగబూనితిని కాన నతఁడుతప్ప మిగిలిన పురుషులందఱు నాకు సోదరులే. నేను దుర్యోధనుని పేరిట నీపెద్దరాజ్యము పాలించుటచే రాజ్యకాంక్షయుఁ దీరిపోయినది. అందువలననే నేను నాబాహుబలమున జయించిన రాజ్యములును కురురాజ్యముననే కలుపుచుంటిని. నేనేకపత్నీ వ్రతస్థుఁడను. అందువలన నీవు ద్రౌపదిని నాశగొల్పుటయు నిరర్థకమే. దుర్యోధనుఁడు నాకు ముఖ్యస్నేహితుఁడు. నేనతనివీడి యెన్నటికి నెక్కడికిని రాజాలను. అతఁడు నాకు పోటీగా దాతయగుఁగాక. మన భరతభూమి కెందరు దాతలున్న

సంత మంచిదియేకదా ! అందువలన కలుగుప్రమాదమేమున్నది ? వంటల వానినిజూచి నేనసూయఁజెందుదునా ? ధర్మపుత్రుఁడు సర్వజ్ఞుఁడని నిరూపించిన మాత్రమున నా శక్తి తగ్గునా ? ద్రోణాదులు సూతుఁడన్న మాత్రమున నా జాతిమారునా? కాని యొకటిచెప్పుచున్నాను. విను. కపట యోగివై మీ చెల్లెలు సుభద్రను నెత్తుకొనిపోయినవాఁడును, సైంధవుని జంపుదునని ప్రతిజ్ఞఁజేయ ప్రతికక్షిగానిల్చినవాఁడును నైన యర్జునుని నే వెనుకవేసికొనివచ్చుట నాకాశ్చర్యముఁ గల్గించుచున్నది. నీభయమునకే వారి నడవులమట్టుపెట్టక విడిచితిమి. పార్థుఁడు విరటుని సుందరముగ పేడి వేషముఁద్దాల్చి తైతక్కలాడి భరతవంశమర్యాదను పోగొట్టినాఁడు. వాని నేలచేరదీయుదువు ? మా కౌరవపక్షమునకువచ్చి వారల జయించుము. కిరీటధారణార్హత లేక బాధపడునీకు మా కురుకిరీటము ధరింపఁజేసెదము. మఱియొక్కమాట. అర్జునుఁడీశ్వరుని జయించినవాఁడని ప్రగల్భములు చెప్పుచుంటివి. ఈశ్వరుని జయించుట నరునకు సాధ్యమా! అతఁడేదో పార్వతి ముద్దుదీర్ప క్రిందఁబడ పార్థుఁడు తానే మహాఘనకార్యము సాధించినట్లు ప్రకటించుకొనినాఁడు. ఇది చాల గర్హనీయవిషయము. కృష్ణా! నన్నిఁక బాధపెట్టక విడువుము. దుర్యోధనుఁడు శంకించుచుండును. మిత్రభేదము కల్పించకుము. నమస్తే. (తెర పడును)

ద్వితీయాంకము సంపూర్ణము.



# మహాభారత యుద్ధము

## తృతీయాంకము (యుద్ధము)

(ప్రథమ దృశ్యము. స్థలము: ఉపప్లావ్యము. కృష్ణమందిరము.)

(కృష్ణునిరాక నిరీక్షించుచు, తోచక అటునిటు ధర్మరాజు తిరుగుచుండును)

ధర్మ : (స్వగతము) హస్తిపురినుండి శ్రీకృష్ణుఁడువచ్చి "సంధిచెడినది. యుద్ధమే స్థిరపడినది. ఆ యుద్ధము రేపే ప్రారంభమగును. మనము తగుసన్నాహముల నుండవలయు. రేపుదాని వివరములన్నియు మనవి చేసికొనెద. నేఁడుప్రయాణపుబడలిక తీర్చుకొనుటకుగాను అభ్యంతర మందిరమునకుఁ జని విశ్రమింతును. సెలవొసంగుము" అనిచెప్పి వెళ్లెను. ఇంతవరకు జాడలేదు. ఇపుడు నేను యుద్ధముఁ జేయుటయా? బంధునాశనమునకుజంకి యెటకేని బోవుటయా? నిరూపించుకొనవలసియున్నది. ఇరుపక్షములవారును కావలసినవారే, ఇందెవరి కేయాపద వాటిల్లినను దానికి కారకుఁడ నేనే యగుదును. పోనీ నేను యుద్ధము మానుకొందమన్నను ఆ పక్షమువా రుద్యుక్తులైన నేనేమిచేయుదును? కాదు నేను లేకున్న యుద్ధమెట్లుజరుగును? ఒకవేళ యుద్ధము జరిగినను నెవరెటులఁ జచ్చినను నాకేమిబాధ? అరణ్యమునకుఁబోయి యేకొండగుహాలలోనో తపస్సుఁజేసికొనెద. అది పిఱికితనమనిపించుకొనదా? ఇట్టి విపత్కరపరిస్థితులస్థిరపడిననేకదా నాయుధిష్ఠిరశబ్దమునకు సార్థకత? ఈశ్వరుఁడు తత్త్వావరణక్రింద నంతయు దాచినాఁడు. వానిని బ్రయత్నపూర్వకముగనే సాధించవలయును. బ్రహ్మవలన నేభాగ్యమును వ్రాయఁబడదు. తానుతీసికొనియు రాఁడు. తనభుజమనోబలముల సాధించి భాగ్యము నొందవలయును. ప్రకృతి మనుజునికి భయపడి దాసోహమనదు. ఉద్యమమువలన శ్రమజలమువలన స్వాధీనమగును. బ్రహ్మవ్రాతయనుట నిరు

ద్యోగియగు కాపురుషలక్షణము. వీరుఁడు చెడ్డగుర్తయిన బ్రిహ్మవ్రాతను శ్రమజలముచేఁ గడిగివేయును. భాగ్యవాదమే పాపావరణము. రాజ్యాధి కారమువహించిన నొక్కని మారణాయుధ ములవలన పలుపురుసమర్థు లణఁగద్రొక్కఁబడియుండవలసినదేనా ? అణఁగఁద్రొక్కుట త్రొక్కఁబడుట యీ రెండును విధివ్రాతయనుట హృదయదౌర్బల్యముకాని వేఱుకాదు. విధివ్రాతయేప్రబలమైన భూమి ధనధాన్యములనే వేళ్ళగ్రక్క యీయవల సియుండును. ఇఁకపురుషప్రయత్నముతోఁ బనియే కనఁబడదు. విధివ్రాత, పూర్వజన్మపుణ్యము, సోమరివాక్యములు. నేనిప్పుడీ యుద్ధోద్యమము నుండి విరమించిన నట్టిపుణ్యముమాత్రము నాకెట్లులభించును ? పూర్వ జన్మలో నేధనముసంపాదించి చనిపోయెనో, ఏయింట నాధనముఁబ్రోగు చేసి హటాత్తుగా సెలవుతీసికొనెనో మఱల నాయింటనే పుట్టి యాధన మునకే యధికారియగుచుండెనా ? అక్కడకూడ వాని యధికారమే చెల్లుబడి యగుచున్నదా ? లేదు. ఆపోగుచేత ధనము వెనుకనే భాగ్య వాదక్రమ మున్నది. అదియే గ్రహించతగినదియునై యున్నది. అదే మనుజునిశ్రిమశోషణము. అదే యవినీతిమయమగు దోపిడి. అదే దీనజన గుప్తధనము. అదే మలినమైన మోసము. అదే గ్లానివలయఆర్జనము. ఒకఁడు ధనమును పాపబలమునఁ బ్రోగుచేయుచున్నాఁడు. దానినే మఱి యొకఁడు భాగ్యవాదబలమున నభివృద్ధిపరచుచున్నాఁడు. నరసమాజభా గ్యమొకటి మాత్రము కనఁబడుచున్నది. అదే శ్రమ, అదే భుజబలము. ఎవనియెదుట భూమ్యాకాశములు వినమ్రమ్మలైవంగి గులాములుగ సలా ములు చేయునో వానిదే శ్రమ. వానిదే భుజబలము. శ్రిమ జలముకల వానిని ప్రికృతివెనుకనుండనీయదు. జయింపఁబడిన ప్రకృతి వానికి సమస్త సౌకర్యములనిచ్చును. ప్రకృతిలో దైవముచేనుంచఁబడిన ప్రతిసుఖలేశము మనుజమాతుని సామాన్యధనము. ప్రితివ్యక్తియు దాని కణకణానికి నధికారి. అన్నిటికన్న నమూల్యమగు ధనము మనోదేహముల శ్రిమ. జనులందఱు బాగుగసంపాదించి సుఖపడవచ్చు. అందఱు శంకారహితులై

కోరుకొన్న సుఖముల నానందింపవచ్చు. రాజు, ప్రజ, అను భేదము లేనే లేదు. అందఱును మానవులే. భాగ్యరేఖ యనునది వేఱులేదు. ఆ భాగ్యరేఖకలవాఁడే శ్రమజీవి. ఎవఁ డెవనికిరాజు. ఎవని కెవరుప్రజ. నరుఁడే భ్రమించి యీ బంధము కల్పించుకొనుచున్నాడు. లోపములేకుండ నీరు, ప్రకాశము, గాలి, ఆకాశము, ఏవిధముగ నందఱికిని సులభముగ నందుబాటులోనున్నవో అటులే యొకానొకప్పుడీ భూమియు నుండి యుండవచ్చు. అన్యోన్యప్రేమ. విశ్వాసము. అపరిగ్రహము. కలిగి నియమ కర్మాధీనులై సన్యాసులుగ సర్వమానవులును సంచరించియుండవచ్చు. ధర్మబంధములో బంధితులై ప్రజలు బ్రతుకుట, ఒకని దుఃఖము మరియొకఁడు నష్టపుచుఁబంచుకొనుట ఉచ్చనీచభేదములు లేకుండుట, సమత్వసమభావములు కల్గియుండుట, భక్తి ప్రపత్తుల మెలఁగుచుండుట యిట్టి మంచి లక్షణముల మానవు లొకప్పుడు సంచరించియే యుండవచ్చు. నిజముగ నాలోచించిన నొకనికంటె మఱియొకని విశిష్టత యేమున్నది? అందు వలననే సమిష్టిసూత్రములో వారు బద్ధులై యుండవచ్చు, అట్టితఱి తెగ లెంపు లెట్లుండును? సమాజమున సుఖమునకు భిన్నత్వ మెట్లుండును? నిజహితసంచయమునకుఁ దావేది? మానవసమాజగ్రాసమును దోచుకొనుటకు, దసయిల్లు మాత్రము నింపుకొనుటకు నాశ యెట్లుండఁబడును? రాజు, ప్రజ అనుభేద మెట్లుకలుగఁగలదు? ప్రభుశాసన మెందులకు? రాగపూరితుఁడయ్యే మానవుఁడు యుద్ధములోఁ బ్రవృత్తుఁడగుచున్నాడు. మతిమాత్రము విరక్తిఁజెందుచున్నది. అందువలన మనస్సులోనే మనుజుఁడు హాహాకారముఁగావించుచున్నాఁడు. యుద్ధమువలనఁగలుగు లాభనష్టములఁదెలిసియు. ద్వంద్వప్రవృత్తిచే నియుక్తుఁడై యుద్ధమునే కావించుచున్నాడు. ప్రతీకారముతో గర్వితమైన మనోవాసన నవ్వించుచున్నది. మనుజత్వభూతము గోకి లేపుచున్నది. వాసనా విరాగములను రెండొడ్లను నీ ప్రవృత్తి ప్రవంతి యొరసికొనుచు ప్రవహించుచున్నది. అదే మానవత్వమును తయారుచేయుచు నరచు

చున్నది. ఇటు కిరీటధారణము, రాజ్యపాలనము, మహదైశ్వర్యము, అతులభోగభాగ్యములు. అటు తప, జప యాగాదులు. వీనికంటె మానవత్వసంపాదనయే గొప్పది. ధర్మ సిద్ధరూపము భేదభావములో లేదు. సహజసిద్ధమానవజీవితము సమత. అదే యమరత కాని జీవనశిఖరముల నడచు మానవులమధ్య విశ్వాసము కుదురుటలేదు. ద్రోహద్వేషముల మానవుఁడే మానవుని శంకించుచున్నాఁడు. దెబ్బలాడుచు పెరుగుచున్నాడు. ఈ యుద్ధమునకు సిద్ధమైన యీ కోట్లకొలది వీరోత్తమ నాయకు లేమంగళస్వరూపము వెదకఁదలఁచినవారో! అమృతముకొఱకే సముద్రమథనము కావింపఁబడినది. కాని యందు ముందు బయలుదేరినది హాలాహలమే. ఈ మానవులు నామంగళస్వరూపమును వెదుకుటకే బహుకాలమునుండి యాకాశమున జ్ఞానశరముల వదలుచున్నారు. పాప పంకమునఁబడుచున్నారు. జ్ఞానదీపమును వెలిగించి యీశ్మశానమునుండి కొంత ముందుకు నడిచి శాంతిని బొందుచున్నారు. రాగములో విరాగియై దండధరుఁడగు ప్రభువు యోగి కావలయును. త్యాగబలిదాన మార్గములఁ బ్రజలకుఁ జూపింపవలయును. పీడింపఁబడెడి నరులలో మనుజత్వ భావము పూరింపవలయును. బలమువల్ల దర్పముయొక్క దురగ్నిని దూరముచేయవలయును. అగ్నిని హిమశీతభావముతో ననుభూతిచేయవలయును. భయానకయభివానమునుండి హాలాహలమును దొంగిలింపవలయును. యుద్ధము జరుపవలయును. విషదంతములు పెకలింపవలయును. తోడేళ్లు, సింహములు మొదలగు ఘాతుక మృగభయమునుండి భూమిని విడిపింపవలయును. మేకపిల్లలను పులిపిల్లలుగా తయారుచేయవలయును. దంతకరాళ కాలకూటమును మట్టుబెట్టవలయును. విశాల వటవృక్షముక్రింద ననేక చిన్న చెట్లు ముడుచుకొని కూర్చున్నవి. వానికిఁ బెరుగుటకు దోహదమీయవలయును. ఏభూమి రసమును బలిష్ఠవృక్షములు లాగుకొనుచున్నవో వాని చివరకొమ్మలను కత్తిరించవలయును. కాన యేల యుద్ధమునకుజంకి భీరుత్వము ప్రకటించుకొనవలయును?

యుద్ధమునకే స్థిరపడి నా యుధిష్ఠిరనామమును, నెవరియందును ద్వేష భావములులేక నాయజాతశత్రు నామధేయమును సార్థకతఁజేసికొని యిటు ధర్మభ్రష్టుఁడను, అటు బ్రహ్మభ్రష్టుఁడను కాక మధ్యేమార్గంబున దైవార్పితబుద్ధితో నా కర్మను విధిని నేను నిర్వర్తించెద.

(కృష్ణుఁడు ప్రవేశించును).

కృష్ణు : ధర్మనందనా ! నమస్తే ! మనకేవిధమైన నిందలురాకుండ వారి యవినీతి ప్రకటితమగునట్లుఁగావించివచ్చితి. అందలివారి యభిప్రాయములు, బలాబలములు, దండనాథుల వివరములు తెలిసికొనివచ్చితి. నన్ను బంధించునేర్పాటుతో యుద్ధవిషయము తేలికగ బహిర్గతమైనది. వారి పదకొండక్షౌహిణులకు 1 ద్రోణుఁడు 2 కర్ణుఁడు 3 అశ్వత్థామ 4 బాహ్లికుఁడు 5 శల్యుఁడు 6 కృపుఁడు 7 భూరిశ్రవుఁడు 8 శకుని 9 కృతవర్మ 10 సైంధవుఁడు 11 కాంభోజరాజు వీరల దండనాథులుగ నియమించి సర్వసైన్యాధిపతిగ తాతగారిని భీష్మునేర్పాటుగావించిరి. మన యేడక్షౌహిణులకును 1 విరటుఁడు 2 ద్రుపదుఁడు 3 సాత్యకి 4 జరాసంధపుత్రుఁడగు సహదేవుడు 5 యదువంశసంజాతుఁడగు చేకితానుఁడు 6 శిశుపాలతనయుఁడగు ధృష్టకేతుఁడు 7 శిఖండి. వీరల దండనాథులుగ నియమించి సర్వసైన్యాధిపతిగ ధృష్టద్యుమ్నుని నేర్పాటుగావింతము. అచటివారలు విజయము విషయమున పదిరోజులని యిరువదిరోజులని నెలయనియు ప్రతిజ్ఞలు పలికిరి. కాని యవియన్నియు జరుగనివి. మన విజయుని దివ్యాస్త్రములముందట వారి యస్త్రములు, బలములు నేమియుఁబనిచేయంజాలవు. ఒక్క క్షణములోఁ బ్రపంచమంతయు మారణముచేయఁగల పాశుపతాస్త్రము మన విజయునియొద్దకలదుకదా! భీష్మ ద్రోణ విదురాదులు వృద్ధులగుటను, మనయందభిమానము కలవారగుట చేతను విధిలేక యటు యుద్ధము చేయుచుండిరేకాని మనలనేమియుఁ జేయరు. వారివలన మన కణుమాత్రమును ప్రమాదములేదు. కర్ణుఁడు కిరీటిక్షణచేఁగాక శ్రుతపాండిత్యముకలవాడగుట దివ్యాస్త్రమంత్రము

లతనికి సమయమునకు స్ఫురించవు. అశ్వత్థామ యుద్ధకళాకోవిదుఁడైనను విప్రకుమారుఁడు. కురుకుమారులు రాజసముకలవారలేకాని దేహపటుత్వము కలవారలు కారు. వారందఱిమ్మృతి మన భీమన్న చేతిలో నెప్పు డెప్పుడా యని యున్నది. శకుని జూదమునకేగాని యుద్ధమునకు పనికి రాఁడు. శల్యుఁడు మనమాద్రేయులకు మేనమామయగుటను తన కూతురగు విజయను మన సహదేవునికిచ్చుటచేతను, ఆ పక్షముననున్నను కర్ణ మనస్సుకలచి మనపక్షమునకే యుపకారముఁ జేయును. సైంధవుఁడు వట్టి పిఱికిపంద. పైగా యిదివరకు మీచే దెబ్బతిన్నవాఁడు. ఇంకను నా పక్షముననున్న పిన్నలు, వృద్ధులు, బ్రాహ్మణులు. బ్రాహ్మణేతరులు అన్యోన్యద్వేషముకలవారు. ఎవరిమట్టుకు వారే తమ మాట పైనుండవలయునని యనుకొనెడివారు. రాజునకు మించిన గౌరవముకలవారుండుటచే నట నసైక్యతమెండు. మన పక్షము వారందఱు నొకే కుటుంబముగ నైక్యముగ పనిచేయువారు. ఏవిధముగఁజూచినను జయము మనకేలభించును. ఇఁక శంకలుమాని యుద్ధమునకుసిద్ధపడుదము.

ధర్మ : కృష్ణా! భారమంతయు నీయదియే. (తెరవాలును)

**ద్వితీయ దృశ్యము. స్థలము : యుద్ధభూమి. కృష్ణార్జునుల ప్రవేశము. (భగవద్గీత)**

అర్జు : యదుకులశేఖరా! కృష్ణా! వీరందఱునెవరు? తాతలు, తండ్రులు, కుమారులు, బావలు, మామలేకదా? అందఱును మనవారే. ఇందు శత్రువులెవరు? ఎవరితో యుద్ధముఁజేయుట? ఎవరినిచంపుట? ఇంటఁబ నావారలఁజంపుటకన్న మఱలనడవుల కాలక్షేపముఁజేయుట మంచిదికాదా? వీరినందఱవధియించిన పాపముఁగట్టుకొని భారతభూమిని వీరపురుషరాహిత్యమొనరించి తన్మూలమున వర్ణసాంకర్యముకలిగించి పితృలోకముననున్న వారికందఱికి గతులులేకుండఁజేసి నేనొందెడి లాభమేమున్నది? మాధవా! బిచ్చమెత్తుకొనియైన జీవించి సన్యాసినై మోక్షసామ్రాజ్యము స్థాపించెదఁగాని నేనీ ఘోరకర్మ నొనరింపఁజాల.

(అని చతికిలఁబడిపోవును)

కృష్ణు : (తనలో) అరే! ఇతఁడు సమయమునకు బలే చిక్కుఁ దెచ్చిపెట్టినాఁడు. నేనెంతయనుకొంటినో యంతయునయినది. (ప్రకాశముగా) అర్జునా! మహావీరుఁడవనుకొంటిని. ధనుర్బాణముల విడిచి యిట్లేల జతికిలపడిపోతివయ్యా! ఇట్టి నీకెట్టిదివ్యాస్త్రములున్నను నేమి లాభము? వీరుఁడవైన నీనోటనిట్టి యనార్యజుష్టము, అస్వర్గ్యము, దుష్కీర్తిప్రదమునయిన మాట వెలువడవచ్చునా? యుద్ధముచేయు మొనగాఁడవువలె ధనుర్బాణములు ధరించి వచ్చి యిట్లేల కూర్చుండిపోతివోయీ! కౌరవసభ నహంకారము, ఇచ్చట మమకారమునా? చాల బాగున్నది. ఈ మమకారము నెట్లుపోగొట్టుట? ఈ యహంకార మమకారములవలననే తిరుగలిజాతిలోని గింజలట్లు జీవులట్లు నలిగిపోవుచున్నారు? అర్జునా! మమకారమువలన నీవు చూపెడి నీలేకిపని పిఱికిపనముగా భావింపఁబడును. జీవితములో మనుజత్వముయొక్క ముఖ్యసమస్యలను చక్కగ పరిష్కరించుట జీవితపరమావధి. మనుజసమాజ హితధర్మమునుంచి వ్యక్తిగతసుఖమును గోరుట హేయకార్యము. నీవు నీవిధి నుండి తప్పించుకొని పాఱిపోవుచున్నావు. సుఖకోశమెక్కడున్నదని భావించుచుంటివి? అడవిలోనున్నదనియా నీతలంపు? ఇప్పటి నీకోరికప్రకార మడవికిఁబోయిన నన్నియులభించినట్లు సంతసింపవచ్చు. యుద్ధభూమిని నీవిట్లు నిరాయుధుఁడవై యున్న నేదేనిబాణమువచ్చి నిన్నును నన్నును జంపవచ్చు. ఇక్కడీబాధ తప్పించుకొని వనమునకుఁబోయిన నందైన దేహబాధ తప్పునా? డొక్కలోపోటు డొంకలో దాగినపోవునా? అందైన చావు కలుగదా? వీరజనాకీర్ణమగు నీరంగమునుండి బెదరి యడవికిఁబోవుట ఘోరపరాజయము. తపస్సునకై యడవికిఁ బోదు ననుట పలాయనమార్గమునకొక కుత్సితసూత్రముగా కనఁబడుచున్నది. దాన మోక్షములేదు. ఇది పరాజితబుద్ధిలక్షణము. నిజధర్మమునుండి వెన్నుత్రిప్పుటవలన సుఖమురానేరదు. గాలికి బెదరి నిద్రవదలి యహర్నిశలు మేల్కాంచి తపస్సునుగూర్చి క్షీణబలుఁడై ప్రతిక్షణముదాగికొనుట

కజ్ఞాని ప్రయత్నించును. జీవితచ్ఛాయలో మునుగుచున్న కర్మలోకము నుండి దూరముగును. అలభ్యస్వప్నము వట్టికల్పనలతోఁజూపును. ఆ స్వప్న మెప్పటను చిహ్నితముగాదు. అందువల్ల జీవితమునకుఁ ప్రకాశములేదు. అది నిర్గంధకుసుమము, నిష్ఫలపుష్పము. ఆకళ నిష్కంటకము, ఛాయాపరి హితము, మృదువు, మనోప్రియము నైనదియే కావచ్చు. జీవితమున కుప యుక్తమేమి ? ఆకల్పనాజగత్తునకు భూమిమీద నస్తిత్వమేది ? వాలు విరహితము, పుష్పసేవితమైన మార్గమున కర్మరజముండని ప్యోమమునకు యుద్ధమునుండి దేహమునువిడిచి మనస్సుతో బర్వెత్తుచున్నాఁడు. దుఃఖ దాహమునుండి సెలవుఁగైకొనుచున్నాఁడు. సంపాదింపలేకుండుటకు బిచ్చ మెత్తుకొనుటకు వికలాంగుఁడవా ? అసమర్థుఁడవా ? దేహ మున్నంత వరకు కర్మ తప్పుననుకొందువా ? జీవితమునఁ బ్రిత్యణువునందుఁ గర్తవ్య మిమిడియున్నది. క్రియాధర్మమునువిడిచి నరుఁడేవిధముగ నిజసుఖమును బొందఁగలడు? కర్మ దేహముకూడ పర్వెత్తును. కర్మ మానవుని మార్గము కాని సన్యాసముకాదు. మానవుఁడు దేనిమీద నడచుచున్నాఁడో యది భూమి కాని యాకాశముకాదు. దేని ననిర్వేదముతో గ్రహించుచున్నాడో యదియే కర్మసన్యాసము. అది వానిని జీవితమునుండి దూరముతీసికొని పోవుచున్నది. దీపము నార్పుట శ్రేయస్సుకాదు. సద్ధర్మదీప్తినుండి దేశ తిమిరముఁబోగొట్టవలయు. నిన్నే విరక్తి భ్రాంతిపెట్టుచున్నదో యది యబల, అస్వస్థ. అకర్మత్వముయొక్క ఛాయ. అది వట్టిజ్ఞానపుమిష. ఈ చింతలో మునుఁగకుండ జాగ్రత్తపడు. నిష్క్రియత్వమునేది భయంకర మైనది. దానిని జీవితములో చేరనీయవద్దు. ఈవిరక్తి నిష్కర్మబుద్ధి సాగ రముయొక్క చంచలతరంగము. ఒకసారి యెగిరిన మఱలనింటికి దారి దొరుకదు. ఈ యకర్మ జీవితమును ననిత్యమని నిస్సారముఁజేయును. స్వప్నమును జాగ్రత్తయనును. నిద్రను సమాధియనును. మరణమును నచలమనును. అనస్తిత్వమునుండి యస్తిత్వమును జారఁబెట్టుకొనుటకు వీలుఁజూపును. అదియే శ్రేష్ఠకర్తృత్వమనిచెప్పి నిష్క్రియత్వములో

లీనపరచును. ఇంద్రియాతీతము నలభ్యమునగు దానిని కేవలముసత్యమనును కనబడేదానిని మిథ్యయనును. దేనిలో కర్మసులభ మో విలాపముతో నట్టి కర్మహీనత్వమునునలవరచుకొనును. జీవనతరువును విరాగమిషతో నఱికిపార వేయును. కర్మసంకుల జగత్తుయొక్క కోలాహలము నిది సహించలేదు. నరుని ప్రకాశమునే చల్లార్చును. చపలహిమ బిందువులు గల పుష్పచుంబన ఆనందమును హరించును. ప్రగతిమయ జీవితమును కంపింపఁజేయును. బలమైనపాట యీపతిహృదయమున బయలుదేరదు. దాని యుద్వేగస్వరములో పిల్లనగ్రోవి మ్రోగదు, నీ వవలంబింపఁబూనిన యీ సన్యాసము చెట్లతోనేమనిచెప్పునో తెలియునా ? "పెరుగుట విరుగుటకొఱకే. వృద్ధేదుఃఖం, కాన నీవు పెరుగవద్దు" అనిచెప్పును. ఆత్మ నాశనము ముక్తియనును. వాడిపోవుట యే సుఖమనును. యోగ్యముగా వికసించిన ఆరోగ్యయుతము, రమణీయమునైన పుష్పమునుగూర్చి మరణ భీతిఁజూపి రసభంగముఁజేయును. "నీవు కాలమునకు భోజనమగుదువు." అని నిరుత్సాహపరచును. శ్రీసౌందర్యప్రకాశ సుఖాదుల నన్నిటిని హీనముఁజేయును. ఈవిరక్తి మానవుని దీనునిగా, దుర్బలునిగాఁజేయును. భుజములనుండి ప్రతాపమును, బాణమునుండి తీవ్రతను, మనమునుండి యుత్సాహమును హరించును. ఇ దనిత్యమని యెవరికి తెలియదు? చచ్చిపోవువెవ రెఱుంగరు ? నీవు చంపకున్నను వీరిలోకముననే యుట్టి కట్టుకొని యూగులాడుదురా ? నీవుమాత్రి మిచటనే యుండిపోదువా? జీవితములో తగినఘట్టముల తగినట్లునడచుట నీ విధి. అందఱునెఱిఁగిన చావును మరల మరల బోధించుటవలన లాభ మేమి? కాలము ననుసరించకుండ విడిపోయి యెవఁడు బ్రతుకఁగలఁడు ? ప్రతినిత్య మనిత్యమునేది నీడగానుండుట వాస్తవమే. దానికి నీవేమిచేయుదువు ? ఇహమున కర్మ, పరమున బ్రహ్మ రెండింటికి చెడిన రేవడి వేలయగుదువు ? జగద్రణమున యోధుఁడవగుట ట్లుతయారు కాగలవు ? వర్తమానజీవితోద్వేగమును తిరస్కరించి, పోయేమరణమునుగూర్చి యహర్నిశములు ధ్యానిం

చుటవలనఁ బ్రయోజనమేమి ? అకర్మపురుషుఁడు దేనికి పనికివచ్చును ? ఎన్నటికి గమ్యస్థానముఁ జేరగల్గును ? అట్టివాని జీవితకుసుమము భూమిపై నేలాగు వికసించును ? ఈ లోకమంతయు నశాశ్వతమని సన్యాసి యాలోచించును. జగత్తుమిథ్యయనియు శరీరము భారమేయనియు నిరసించి యమరత్వముఁగూర్చి జగత్తునువిడిచి తిరుగఁదలచును. వానినిమాత్రము మజేయమైన కాలము మ్రింగకుండునా? అతఁడు మ్రింగఁబడినను యీ జగత్సరణి ముందునకు సాగకాగునా ? జీర్ణదళకుసుమములు రాలిపోవ మఱల నా స్థానమున నూతనదళకుసుమములు పుట్టుచునే యుండును. అకర్మయని యేడ్చుటవలన నమరత్వమురానేరదు. కర్మభారమువలన నాయుఃక్షీణమునుకాదు. భూమిమీద కర్మనిరతుఁడు నిలబడి నవ్వుచున్నాఁడు. ఆకాశమునఁగర్మరహితుఁడెగురుచు నేడ్చుచున్నాఁడు. కర్మనిరతుఁడు భూమి పంకమునుండి చించుకొనివెడలి పంకజమువలె శోభించుచు. త్రివిధతాపములను సహించుచు, జ్యోతిలోనాడుకొనుచు, చీకటిమీద నడచుచు, నగమ్యమైన యతలమును వదల్చుకొని భూజముల నలంకృతముఁగావింపుచు భూమిపై పాలను ప్రవహింపఁజేసి రసాస్వాదనముఁగావించి మానవత్వ జయదుందుభి మ్రోగించి జగత్తును కొంత రామణీయకముఁగావించి కొంత ముందుకునడచి సెలవుగై కొనుచున్నాడు. కర్మరహితుఁడు కర్మహీన చింతనము సహాయముగఁదీసికొని యాకాశములో మోక్షమును వెదకికొనుచు నొడ్డుదొరుకక తిరుగుచున్నాఁడు. కర్మనిరతుఁడగు నరుని భిక్షమీద తనదేహమును పోషించుకొనుచు ప్రపంచమున బ్రతుకుచు దానినే నిర్లక్ష్యముగఁజూచి తాను నిర్లిప్తునివలె సంచరించుచున్నాడు. సన్యాసి యేది యలభ్యమో, ఏది యదృశ్యమో, ఏది యగోచరమో దానిని సత్యమనును. వాని మాటలు వినిన నిజముగ కర్మక్షేత్రమైన దేహమబద్ధమనిపించును. మనుజుని ప్రతాపములు నిరర్థకమనిపించును. కర్మను విడిచిన పురుషుఁడు బాగుపడునేమోయనిపించును. భూమినివిడచి యాకాశమున నడవవచ్చునేమో యనితోచును. జన్మమెత్తుటయే మహాపాపమని

పించును. ప్రబలమైనకోరికఁగలిగియుండుట దుఃఖభారము భుజములమీద పెట్టుకొనుటవంటిదిగా కనబఁబడును. శబ్దాదితన్మాత్రలు పాప మని పించును. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను నిందియములు ఘాతుకత్వముకలవియేమో యనితోచును. ఆత్మహత్యవలన ముక్తిమార్గము తెరువఁబడునదిగ కన్పించును. నిజముగ కర్మకంటె జీవనము సులభము కాదనిపించును. నిఖిలసృష్టి యాకస్మిక సంఘటన యనిపించును. అభిలాష, ఉద్దేశ్యాదులు లాభములేని వనిపించును. ఈ భూమి యశాశ్వతమైనదైన నదిమనదోషమా ? మనము స్వయముగ రావలయునని యీ లోకమునకు వచ్చితిమా ? లేక పంపఁబడితిమా ? మనుజుని భాగ్యము, కృత్యము భూమిలో దాచబడియుండకపోయిన మనమాకాశమందే పుట్టుదుము. కాన అర్జునా! నిష్కామకర్మతో కర్మబంధములనుండి విముక్తుఁడై యింద్రియవ్యాపారముల శ్రద్ధవహించి మానవుఁడు సంచరించవలయు. ఈ కఠినమైన మట్టే యాకలిని కల్గించును. తృష మేలుకొలుపును. అది మనస్సును నాలోచనవైపునకు భుజములఁ గర్మవైపునకుఁ బంపించును. దేహముపొందని మనోసుఖము మృష. మనస్సునకు దేహమునకు సంబంధమున్నది. దేహము తెచ్చునది. మనస్సు ఆనందించునది. మనస్సునకు దేహము కవచము. దేహములోనే మనస్సుండునది. దేహముచేయు కర్మ మొకటి. మనస్సుచేయు నాలోచన మఱియొకటిగా నుండకూడదు. జ్ఞానమయనివృత్తినుండి చింతతొలగదు. మనస్సునకు చింతతొలఁగ నప్పుడు దేహమునకు కర్మ యేలాగునతప్పును? అన్నియువిడిచితి ననుకొని నరుఁడు వనములో దాగినంత మాత్రమున బాహ్యశతృసంఘర్షణ మొక వేళ తప్పినఁదప్పవచ్చుఁగాని యంతశ్శత్రుసంఘర్షణ మంతట నుండునదియె కదా! మనమున యతి జయించెడి శత్రువుల నీ విక్కడేలజయింపలేవు ? అంతశ్శత్రునిర్మూలన కాత్మహననక్రమముతో హ ఠ యో గి ప్రియత్నించును. నీవు దానిని సంయమనముతోసాధించు. వైరాగి, సన్యాసి యరణ్యమున దేనిని పొందఁజాలడో దానిని నీ విచ్చటనే పొందఁగలిగెదవు

వనమే కాదు పుణ్యభూమి ? ప్రతి యంగుళమంతయుఁ బుణ్యభూమియే. అన్నము, నీరు, గాలి, (కాళ్లు, చేతులు మొదలగు యవయవములతోఁ గూడిన దేహము) భాష, విజ్ఞానము మొదలగునవన్నియును కావలెను; గమ్యస్థానముఁ జేరవలెను. జీవితరహస్యము ప్రపంచములోనే చూడు. సన్యాసము తప్పనిసరియయిన దానిని మానవద్దు. యుద్ధానంతర మీ మోక్షమంత్ర మందఱికినినేర్పు. నరరాగానలమును శమింపఁజేయుము. అమృతమును వర్షించు. ప్రస్తుతము ధనుర్బాణములఁదీసికో. శరీరముతో నీవు ప్రజామధ్యమున భూమిమీదఁబుట్టితివి. ఆ దేహమునకు, నాపర్జకు, నాభూమికి సంబంధించిన కర్మముఁ జేయుము. నిర్జనవనమునకు పోకుము. నిజకర్మ గుర్తించుము. చేతనత్వమునువిడిచి జడత్వమెందుకుఁబొందెదవు? త్వరగాలెమ్ము. శాంతిసుఖములు వనభూమిలోలేవు. ఈ ప్రజామధ్యము ననేయున్నవి. జీవనముతో నిలబడు. నిష్కామకర్మ నిన్ను పిలచుచున్నది. యుద్ధముచేయుము. కర్మరసన్యాసివికమ్ము. ఆకాశములో తిరిగే మానవుఁడేమియుఁ జేయఁజాలఁడు. ఆకాశం, గగనం, శూన్యం. అచ్చట నేమియులేదు. ఏమున్నను భూమిలోనేయున్నది. దానివలననే మానవుఁడన్నియుఁ బొందఁగలుగును. మట్టిని జయించినవారలదగ్గఱ కాకాశము దేవచ్చును. బ్రిహ్మార్పణబుద్ధితో కర్మముఁ జేయుము. కళంకము తగులదు. ఏ మానవదేహముమీద మనస్సున కాధిపత్యముండునో, ఏదినమున భోగలిప్సజీవనము త్యాగముమీద నాధారపడియుండునో, ఆదినముననే నరుఁడు తన జీవితరహస్యమును తెలిసికొనఁగల్గును. ఈ మనుజులు చచ్చినను మానవత్వము నశించదు. లేచి బలమును చేకూర్చుకొని ముందుకు నడువుము. సత్యమే జగమునకాధారము. ఆశ యనుదీపమును వెల్గించి రణభీతి తిమిరమును తొలగించు. విజయశంఖము పూరించు. గమ్యస్థానము చాలదూరమందున్నది. ఆలస్యము చేయవద్దు. జ్ఞానదృష్టితో దేవుని స్థూలరూపమగు నీవిశ్వరూపమును వీక్షించు. (విశ్వరూపముఁజూపును)

అర్జు : ధన్యోస్మి, ధన్యోస్మి. దేవా! నీ జ్ఞానోపదేశంబున నాకృత్యము తెలిసికొంటి. ఇఁక నీయాజ్ఞ నిర్వర్తింతును. (తెర పడును)

తృతీయ దృశ్యము. యుద్ధభూమి. (భీష్ముని ప్రవేశము)

భీష్మ : (స్వగతము) ప్రశస్తమగు భరతవంశమున భాగీరథీ శంతనులకు జన్మించితి. పరశురాము నాశ్రయించి ధనుర్వేదముసాంతముగ గ్రహించితి. బ్రహ్మచర్యము, సత్యవ్రతము యావజ్జీవము పాలించుకొంటిని. సాత్యవతేయవంశజులచే నీధరిత్రి యెల్ల సక్రమముగా పాలింపఁ జేసితి. తుదకు యుద్ధముచేసి పదివేవుర సంహరించి కౌరవేంద్రుఋణము సైతముఁ దీర్చుకొంటి. ఈ పదిదినంబులనుండి యుద్ధముఁ జేసి బడలియున్నాను. మృత్యువు నాయాజ్ఞకొఱకు నిరీక్షించుచున్నది. అసాధ్యమగు రణముఁగావించి శ్రీకృష్ణునంతటివానిచే ప్రతిజ్ఞాభంగముగ చక్రము ధరింపఁజేసి కృతకృత్యుఁడనైతి. జగమునుండి యుగమను కాల ఖండమొకటి సెలవుదీసికొనుచున్నది. అది తనసమృద్ధిచితిని కడిగిపోవుచున్నది. యుద్ధధూళితో నిది సమాధియుగమైనది. జీవనధార మాత్ర మెడతెగకుండ ప్రవహించుచునేయున్నది. గత మచేతనమై మృత్యువు యొడిలో పడిపోవుచున్నది. మనుజుని భవిష్యత్తు దగ్గఱగా బిలచుచున్నది. మట్టియొక్క స్థూలభాగము తొలగింపఁబడుచున్నది. ఈ యుద్ధములలో నరుని భాగ్యముపండదు. మండుటయే. రక్తములో మనుజుఁడు మునుగుచున్నాడు. కాని మనుజత్వముమాత్రము మునుగక నిలిచియే యుండుచున్నది. ఏదో యొకయాశతో మానవుఁడు రంగమున కుఱుకుచున్నాడు. పాపపుణ్యములను రెండు కొమ్మలమీద నాశాపుష్పము వికసించును. కురుక్షేత్ర చితిభస్మములోను నీయాశయున్నది. మానవత్వపుటాశను సాధించినవాఁడే సాత్త్వికధర్మప్రణేత. అతఁడే మానవసమాజమునకు మిత్రుఁడు. ఎవనిజ్ఞానకిరణము పాపపుచీకటికి దాసియై యుండదో, జయాపజయంబుల సమవృత్తి యెవనికి సిద్ధించునో అట్టి మానవునకు

కోటిమందిసన్యాసులు దిగదుడుపు. మట్టివలన భయపడువారికొఱకీ భూమి బ్రతికియుండలేదు. ఈ రసజగత్తునుండి పారిపోయి యోగి పంచాగ్నులమధ్యమున భస్మమగుచున్నాడు. రశ్మిదేశమార్గము చీకటికవఁలది. అక్కడ ఉప చీకటి నెత్తిమీద స్వారిచేయును. పాపపుగర్తలోఁ బడకుండ నిప్పటి కెవండుమిగిలెను ? వైతరణీనదీజలములో నిప్పటి కెవనిబట్ట తడవకుండనున్నది ? ఆదినుండి యంతముపఱకు నెవనిమార్గ ముజ్జ్వలముగ నుండఁగలదు ? ఈ సంసృతిచీకటిబంధమును నెవఁడు బలుఁడై ఛేదింపఁగలఁడు ? సూర్యచంద్రులిద్దరును తేజోమూర్తులైనను జీవితపథమార్గమునకు భయపడుచు ప్రయాణము సాగించుచున్నారు. ఆ మార్గముననే రాహు కేతువులచే గ్రసింపఁబడుచు మఱల ముక్తకబళులై యటులనే పడుచు లేచుచు పోయిపోయి తుదకే పర్వతశిఖరలోయలోనో జారిపోవుచున్నారుకదా. ఆ పుణ్యమూర్తులు నిరాధార సత్వరథమునఁగాలినడకఁ బ్రయాణముచేసినట్లు వికటరణతమమును జీల్చికొనుచు కిరణదేశము వంకకుఁబోపుచుండిరి. యౌవనవయస్సును భానూదయమస్తగిరికి చేరినది. వృద్ధవయస్సును కాలరాత్రి యాసన్నమైనది. చీకటు లలముకొనుచున్నవి. ప్రేమకు హృదయమునిచ్చి కర్మకు భుజములనిచ్చి. కురుక్షేత్రమునకీ జీవితసౌఖ్య మంకితముఁజేయఁదలచుకొంటిని. కర్మవల్లకఠినమైన స్నేహబంధముకలిగినది. నాహృదయము దయార్ద్రముకాదు. కఠినపాషాణము. ఒక్క వీరరసముమాత్రమే నా కనుభవము. ధర్మభీతిమాత్రము నన్ను ప్రతియంగుళమునకు నడ్డగించును. కర్మ నాసేవ తీసికొన్నది. శబ్దరహిత యింగితత్త్వమునిచ్చుచు బలిపూర్వక స్నేహముచేయుట కాజ్ఞాపనచేయుచున్నది. కృత్రిమపటలము సంకటసమయముల నంతరించును. సంఘర్షణము పెరిగినపు డసంపూర్తిక భావిద్యుత్తు మెఱసి కాలలీనమగును. అణగిపోయిన నా యౌవనము స్నేహమునకు దాసోహమనుటకు లేచి నిలబడినది. బుద్ధిభ్రమ తొలగినది. కర్మయొక్క మిథ్యాజాలము పోయినది. బ్రహ్మచర్య ప్రతిజ్ఞాదినములు యుద్ధములో ప్రేమపిలుపుక్రింద నయినవి.

ప్రాణములపై నియంతృత్వము వహించితి. మాయామర్మముల గుర్తించ నైతి. నా వీరత్వాహంకారమే నన్నింతకుఁదెచ్చినది. సేనాధిపతినై తిని. పార్థునివిషయమున నాకు సంతసమే. మనోసిద్ధికలవానికే జయము, సంపద కలుగును. నీతిజ్ఞానములు తప్ప నాకు మఱేకోమలత్వములేదు. పూర్వవైరముఁదలంచి యంబ శిఖండియైపుట్టి వరప్రభావమున నా ప్రాణ ములుగొన నాశించుచున్నది. నాజీవితరహస్యమెఱిఁగిన శ్రీకృష్ణ భగ వానుఁడు దండనాథుఁడగు శిఖండిని ముందు కవ్వించుచు, తన విజయరథ మును వెనుకనుంచి వానిని కాపాడుచున్నాడు. నేను వీరత్వముకల వాఁడనగుటచే యుద్ధములో నిరాయుధుని, పారిపోవువానిని, నపుంస కుని, స్త్రీ పేరుకలవానిని మొదటస్త్రీయై పిదప పురుషునిగాఁ మారిన వానిని కన్నెత్తియైన చూడను. వారిపై బాణము విడువను. అట్టి వికటవిపత్కరపరిస్థితిలో కృష్ణప్రోత్సాహమున విజయుఁడు తనతీవ్ర బాణ ములనన్నుఁగొట్టఁగలఁడు. ఆ భగవానుని స్మరించుచు యుద్ధమునపడి ధర్మజునికూడ సంతసపరచి యుత్తరాయణముపరకు మృత్యువును నిలఁ బెట్టి గతించి తరించెద. జై హింద్ !!

తె ర ప డు ను.

తృతీయాంకము సంపూర్ణము.



# మహాభారత యుద్ధము

## చతుర్థాంకము (శాంతి)

**ప్రథమ దృశ్యము. స్థలము : అభ్యంతరమందిరము (టెలివిజన్ స్టేషన్) సంజయ ధృతరాష్ట్రుల ప్రవేశము.**

ధృత : సంజయా! అట్లు భీష్ముఁడు పడినపిమ్మట జరుగుచున్న యుద్ధవిషయములఁ జెప్పుము.

సంజ : మహారాజా! భీష్ముఁడు పడినపిమ్మట మనవారు సైన్యమునకు ద్రోణుని పట్టంబుఁగట్టిరి. ఆ సంతసమున ద్రోణుఁడు సుయోధనుఁడు కోరినట్లు పార్థుఁడులేనితఱి ధర్మజుని పట్టియిచ్చుటకు ప్రతిజ్ఞ చేసెను. ధర్మజుని జూదమాడించి మఱలవనములకుఁ బంపవలెనని సుయోధనుని యూహ. ధర్మజుఁడందులకు కంగారుపడి పార్థుని దగ్గరనే యుంచుకొనుచుండెను. కృష్ణుఁడొకపరి త్రిగర్తసైన్యముపై తాకుటకు నర్జునుని గొంపోయెను. అదేసమయమని ద్రోణుఁడు పద్మవ్యూహముపన్నెను. విజయునకుతప్ప యావ్యూహభేదన మెవరికి తెలియదు. అభిమన్యునకు మాత్రము ప్రవేశించుటయే తెలియును. సాత్యకియు, భీముఁడును మనయభిమన్యుఁడు వ్యూహమును భేదించిన నేమభిమన్యునకు బాసటగనుందుమని ప్రోత్సహించ వారలయందలి విశ్వాసమున ధర్మజుఁడంగీకరించి యభిమన్యుని పద్మవ్యూహము ప్రవేశింపఁజేసెను. వ్యూహద్వారమున సైంధవుఁడుండి వరప్రభావమున నడ్డగింప నటుల భీమ సాత్యకులుకాని మఱెవ్వరుకాని వ్యూహమును ప్రవేశింపఁజాలరైరి. ఇఁక యభిమన్యుఁడొక్కఁడగుట తిరిగివచ్చుట తెలియనివాఁడగుట కౌరవవీరులచే హతుఁడయ్యెను. దానికి పాండవులు దుఃఖింపుచుండ కృష్ణుఁడును దుఃఖించెను.

ఎవనియాశచే తా నీయుద్ధముఁ జేయుచుండెనో, యట్టి యభిమన్యుఁడు పోవుటచే మమకారము సమూలముగఁబోవ నర్జునుఁడు అడ్డుపడిన సైంధవుని రేపు సూర్యాస్తమయమునకుఁ బంపుదును లేదా నేను చత్తును. అని ప్రతిజ్ఞఁ జేసెను. తానెంతగ గీత బోధించిననుపోనిమమకారము తన నష్టమున పోవుటకు సంతసించి కృష్ణుఁడర్జునుని రణమునకుఁ బ్రోత్సహించెను. ద్రోణుఁడానాఁడు శకటవ్యూహము పన్నెను. కౌరవులు సైంధవుని రక్షించుకొనుటకును, అర్జునుఁడు సైంధవుని చంపుటకుఁగా సైన్యములు పండ్రెండు యోజనముల దూర మడుగెడమ లేకుండ సమీకరింపఁబడెను. ఎట్లయిననేమి సాయంకాలమునకు సైంధవుని నర్జునుఁడు కడతేర్చెను. వినగూడనివార్త వినిన ద్రోణుఁడు గుండెయాగి చనిపోవునని శ్రీకృష్ణుఁడు గ్రహించి ధర్మజవేషధారియగు రాక్షసునిచే నశ్వత్థామ చచ్చెనని యనిపించెను. దానివలన గుండెఆగి ద్రోణుఁడును చనిపోయెను. ఇటులైదు దినములు ద్రోణుఁడు యుద్ధముఁజేసెను. ద్రోణువధకశ్వత్థామ కోపించి నారాయణాస్త్రమువదలెను. దాని విరుగుడు కృష్ణుఁడెఱింగి యుండుట పాండవపక్షముననున్న వారలందఱు నిరాయుధులై దానికి నమస్కరింపఁజేయ నదివమ్మయ్యెను. సైన్యాధిపతిగ కర్ణుండాయెను. కర్ణుఁడు దేవేంద్రునిదగ్గఱపుచ్చుకొన్న శక్తిబాణము ఘటోత్కచునిపై వదలవలసివచ్చెను. దాన ఘటోత్కచుఁడును శక్తిబాణమును గతించినవి. అర్జునుఁడు బ్రతికెగదాయని కృష్ణుఁడు సంతసించెను. భగదత్తుని వైష్ణవాస్త్రమును తన రొమ్మున తాకించి శ్రీకృష్ణుఁడు వృథాచేసెను. కర్ణుని నాగాస్త్రమునుకూడ కృష్ణుఁడు రథమునుకుదించి అర్జునుని కిరీటమునకు తగులునట్లుచేసి నిరుపయోగముఁజేసెను. శల్యుఁడు కర్ణునిమనస్సు కలచుచుండ రథచక్రము క్రుంగిపోయెను. దానిని కర్ణుఁడే సరిజేసికొనవలసివచ్చెను. ఇంతలో భీముఁడు తన ప్రతిజ్ఞ ప్రకారము కురుకుమారుల తొంబది యెనమండ్రఁజంపె. దుశ్శాసనుని ఱొమ్ముఁజీల్చి వేడినెత్తురు ద్రాగె. కర్ణుఁ డర్జునునితో యుద్ధముచేయుచు రథచక్రము క్రుంగిన

తటి సరిజేసికొనుచుండ కృష్ణుని ప్రోత్సాహమున నర్జునుడు కర్ణునితల నఱికెను. పిమ్మట శల్యుఁడు సైన్యాధిపతియయ్యెను. ధర్మజునిచే నతఁడును హతుఁడయ్యెను. ఒంటరిపాటున సుయోధనుఁడలసటతీర్చుకొనుటకు ద్వైపాయనహ్రదంబునదాగెను. అదితెలిసి పాండవు లుల్లికుట్టు మాటలతో దుర్యోధనుని బయటకులాగి భీమ దుర్యోధనులకు గదాయుద్ధమున తులారణ మేర్పరచిరి. అందు కర్మవశమున భీమునిగద సుయోధనుని తొడలకుఁ దగిలెను. సుయోధనుఁడు పడిపోయెను. విచారించు ధర్మజుఁడుగల పాండవులను కృష్ణుఁడారాత్రి దూరముగ నదీతీరమునకు విశ్రాంతికై గొంపోయెను. కృతవర్మ, కృపాశ్వత్థాములు సుయోధనుని యవస్థఁజూచి వానికి మెప్పుఁగలిగించుటకు రాత్రి పాండవుల శిబిరములఁజొచ్చి అందుండువారల నందఱ నిద్రలోఁజంపి యా శుభవార్త దుర్యోధనునకుఁ జెప్పిపోయిరి. దాన సుయోధనుఁడు సంతసమునఁ బ్రాణముల విడిచెను. కృష్ణునిచే దూరముగ గొంపోబడిన పాండవులు మాత్రము బ్రతికియుండిరి.

ధృత : అంతయు సర్వనాశనమైనదికదా.

(అని విచారించును. తెర పడును.)

ద్వితీయ దృశ్యము. యుద్ధభూమి. (మహాశ్మశానము)

విచారముతో ధర్మజుని ప్రవేశము.

ధర్మ : (స్వగతము) యుద్ధమువలన నరమేధము పూర్తియైనది. భీముఁడు దుశ్శాసనుని రొమ్ము బ్రద్దలుగొట్టి డొక్కచీల్చి వేడినెత్తురుద్రావి యానంద మనుభవించినాఁడు. ఇది మానవత్వమా? దానవత్వమా? ఇట్టి ప్రతీకారమున ప్రతీకారేచ్ఛ, ప్రతిహింసాకాముకులకు గొప్పయానందము సంభవిల్లుచుండుట యథార్థము. ఐదుగురు పసముద్దుబిడ్డలను దారుణ హత్యఁగావించిన యశ్వత్థామయందలి క్రోధాగ్ని యాయశ్వత్థామశిరోరత్నముపలన ద్రౌపదికి శాంతికలుగుటచే ప్రతీకారప్రతిహింసలకంటె

శత్రుద్రవ్యాపహృతియు విజేత కానందహేతువని తోచుచున్నది. ఓ జయలక్ష్మీ! ఎఱ్ఱనిచీరఁగట్టుకొని నీరాజనము వెలిగించి హారతినిచ్చి రక్త కుసుమమాల మెడను వేయుటకుఁ బ్రతీక్షించుచు నా యెదుట నిలబడితివి. కానినేను నిన్ను చూడను. దారుణలోకమునుండి శాంతిలోకమును మనస్సులోఁ జూచుచున్నాను. విజయలక్ష్మీ! యముని దంష్ట్రలలో నీపైట చెంగు తగులుకొన్నది. నీపైటఅంచు అగ్నిజ్వాల. ఓ సంహారశక్తి యొక్క పెద్దకూతురా! జయలక్ష్మీ! నీచేతియందలి యాపుష్పమాల యెవరికి? కత్తి గూసినవాఁడు సెలవుతీసికొన్నాడు. నేను విరాగిని. నన్ను నీవంగీకరింపఁ జేయలేవు. నీయిల్లు వెనుకనున్నది. ఇది తపోభూమి. నీమాల యిచట యెండిపోవును. భూదేవి తనపుత్రులచావునకు బాధపడుచున్నది. కుళ్లిన విషగంధములో మునిగిపోయినది. వాసన సహించలేక గాలి ముక్కు మూసికొని పారిపోవుచున్నది. సూర్యభగవానుని పవిత్రకిరణములు భూమిని స్పృశించుటకు జంకుచున్నవి. వాయస, గృధ్ర, సృగాల, శ్వాన, వనమార్జాల దళాలు యమునికి నతిథులైనవి. భరతవీరుల దుర్గతి యిట్లు వాటిల్లినది. ఆహా! ప్రియాలింగన హేతువులై యేనుఁగు తొండములవలె శోభించు వీరులభుజములు గ్రద్దలెట్లు పీకికొని తినుచున్నవో! స్వప్నఖండారములగు వీరులతలలఁ గాకు లెట్లు పొడుచుకొని తినుచున్నవో! స్నేహసిక్త గంభీరవక్షస్థలంబుల నా రాపులుఁగు లెట్లు భేదించి లాగుకొనిపోవుచున్నవో! కాలచోరులు వీరశిరోమణుల దోపిడీ చేసిరి. కళావిజ్ఞానము, ధర్మము, శూరత్వము, వీరత్వము యుద్ధపుకానుకలుగా దైవమునకు సమర్పింపఁబడినవి. భూదేవి యపహృతరత్నయైనది. జయలక్ష్మివచ్చినమాట నిజము. మఱి భాగ్యలక్ష్మి పోయినది. దుర్యోధనుని శుష్కకంకాళము, అభిమన్యుని మృదుకబంధము జీవమనస్సంతాపహేతువులై జయచిహ్నాములుగ నిలిచి యున్నవి. ఆకాశము హాహాకారముల నిండుచున్నది. ధూళియే మిగిలినది. శూరులు, వీరులు దుర్యోధనాదులతోడనే పోయిరి. శవాలు మాత్రము యుద్ధభూమి నిండియున్నవి! కొడుకులుచచ్చినతల్లుల

భర్తలు చచ్చిన భార్యల యాక్రందనధ్వనులు చెలరేగినవి. సుఖము, శాంతి, గళించినవి. కరుణ, దైన్యము దుఃఖము మిగిలినవి. రణము శాంతించినది. భూమ్యాకాశములు నిశ్శబ్దతవహించినవి. భూదేవిచచ్చి యున్నదో బ్రతికియున్నదో తెలియుటలేదు. భూతప్రేతపిశాచములు జోలపాటలుపాడుచున్నవి. నాది మిషతోకూడిన విరాగము. ఎంతో పాడుపనిచేసితి. ఇప్పు డహ్హారించిన నేమిలాభము? కరుణ యిప్పుడు మేల్కాంచినది. ప్రతీకార ద్వేషజ్వలన మధర్మమును కప్పిపుచ్చునదిగ నైనది. ప్రతీకారేచ్ఛవలన దయ నశించును. సత్యస్వరూప మిపుడు చూపఁబడినది. వినాశ మంతట గనఁబడుచున్నది. అంతర్వాణి "కురురాజుప్రతాపమునకు నీగుండె మండలేదా? అదిమాత్ర మసూయ కాదా? దుర్యోధనునిసుఖమునుజూచి నీవేడ్చి ప్రపంచమునే మోసముఁ జేసి నాశనమొనర్చినావు. లోపల ప్రతీకారేచ్ఛ బయటచేతులనలుపు వినయము. ఇదేనా నీధర్మము? గురువధకై యబద్ధ మాడలేదా? యన్యాయముగా దుర్యోధనునితొడలు విరుగఁగొట్టించలేదా? దుశ్శాసనుని వక్షస్థలముఁజీల్చుట మానవత్వమా? దానవత్వమా? అధర్మమని నీవు దేనిని బలుకుచుందువో దానినే చేపట్టితివి. ఈ పాడురాజ్యమును పాలించు. వీరవధువు విధవయై యేడ్చుచున్నది. భూమి పతివిహీనయై నిన్ను భర్తగా వరించుట కెదురుచూచుచున్నది. ఈ పుస్తెముడుపు వెధవముండ పాడుపెండ్లిచేసికో. కురుపక్షమున మిగిలిన కృప, కృతవర్మ, అశ్వత్థామలు ముగ్గురు, పాండవపక్షమున మిగిలిన పాండపుత్రైదుగురు, కృష్ణ, సాత్యకులు కలిసి యేడ్వురు. మొత్త మీపది మందితోఁగూడిన యీ గొప్పరాజ్యము పరిపాలించు. ఆనందమనుభవించు. నీకు ద్రౌపదీమానభంగము మొదలగు కొలదియవమానములు కలిగిన వనుకో. నీవు లోకమునకుఁజేసిన ద్రోహము ? కొలది నేరమునకు ఘోర శిక్ష న్యాయమా ? ఇఁక విజయశంఖము పూరించు. నరబలియైనది. ధర్మరాజా ! ఇది దీప్తి కాదు. రణజ్వరము. దానవశిఖ. భయంకర రాగాగ్ని. బుద్ధిప్రమాదము. ఇది కురువంశనాశనాగ్ని కాదు. లోకవినాశనాగ్ని "అని

యనుచున్నది. ఇద్దరభిమానులఁగూర్చి యీ శోకము పులుముకొని యెందులకు నాశనము కావలసివచ్చెనో తెలియకున్నది. అనాలోచిత నరరక్తాజ్యము యుద్ధాగ్నిలో వేల్వఁబడినది. మిగిలిన పదిముందేగాక కుంటి, గ్రుడ్డి, వ్రణి, వికలాంగాదులు మఱికొందఱును మిగిలియున్నారు. సర్వమునాశనమైనది. సింహాసనము మిగిలినది. ఇదేనా యలంకారము? ద్రౌపదీ కేశముల నల్లత్రాచు నాట్యము చేసినది. శుభజ్యోతిని లోభము హరించినది. మనోదృష్టి, శాంతి, శుభఖ్యాతి,యనురాగములతో కూడిన విజయ మానందదాయకము. కాని యిట్టి విజయ మెట్టిసంతోషదాయకము? ఇఁక ముందైన మానవులు జ్ఞానముకలిగి యిటుల యుద్ధముల వలనఁగాక నవధర్మజ్యోతిని శాంత్యాదిసన్మార్గముల వెలిగించుటకు నిరాశావంతులుకారని భావించెద. అటుల కాకుండనుండుఁడని ప్రార్థించెద.

(తెరలో) ధర్మరాజు వినుటనభినయించును.

ధర్మరాజా! నేను దుర్యోధనుఁడను. మేము కష్ట సముద్రము దాటి సుఖసముద్రపుటొడ్డునకుఁ జేరినాము. మీరును నిచటకుఁ జేరవలసియే యున్నది. నీ వేమైన యనుకో. మాకు నీగొడవలతో సంబంధము లేదు. మాకు స్వర్గము కనఁబడుచున్నది. ఇచ్చటంతయు సుఖమే. అంతయు నానందమే. యుధిష్ఠిరా! జయమెవరిది? మాది. సౌఖ్యమెవరిది? మాది. ఆనందమెవరిది? మాది. మీదో? పరాభవము, అపజయము, కష్టము. దుఃఖము తెలిసినదా? మఱొక్కసారి మీదే పరాభవము, మీదే యపజయము, మీదే కష్టము, మీదే దుఃఖము. విజయ కానుకలు మావి. పశ్చాత్తాపము, వ్యంగ్యోక్తులు, అంతర్దాహము మీవి. నిజమేనా?

ధర్మ : (కంపించుచు) నిజమురాబా! నిజము. ఈ వినబడునది దుర్యోధనుని కంఠధ్వని. అవ్యక్తముగా నంతర్వాణియు నటులనే చెప్పుచున్నది. అంతయు రక్తసిక్తము. క్రోసులకొలది దూరము రక్తము ప్రవహించి భూమి యెఱ్ఱనైనది. రక్త ప్రవాహ తీవ్రవేగములో మొండెములెట్లు తేలియాడుచున్నవో! నేసనుకొనిన భాగ్యము, రాజ్యము, భోగము,

సుఖము, పరహింస, ప్రతీకారములు చేఁజిక్కినవా? ఎగిరిపోయినవా? చేఁజిక్కలేదు. శత్రువులతోనే యెగిరిపోయినవి. ఇఁక నాకు మిగిలినది పశ్చాత్తాపము. వ్యంగ్యోక్తులు. యుద్ధప్రచేత విఫలము, విషయుక్తి జ్వలనము, అసహిష్ణుత, దేశవినాశము, దేశద్రోహము, జాతిద్రోహము. కోట్ల మంది తల్లులు పుత్రులకొఱ కేడ్చుచుండ కోట్లకొలది పతులుపోయిన భార్యలు శృంగారవిహీనలై యటమటించుచుండ నాభార్యయగు ద్రౌపది దివ్యాలంకృతయగుటకేనా నేను సంతసించునది? ఈ మరణించిన కోట్లకొలది ప్రజలందఱు నా కపకారము చేసినవారలేనా? సర్వవినాశనకర మగు యుద్ధము ప్రజలుకాని, భగవంతుఁడుకాని యేలమాన్పఁజాలక పోవుచున్నారు? రక్తముతో వడబోసిన యీప్రజారాజ్య మేపాషాణహృదయముతో ననుభవించేది? అయ్యయో! ఈ భూమియంతయు శత్రురక్తముతో తడిసినదేనా? కాదు నా ముద్దుబిడ్డడు; భావిభారత సౌభాగ్యసంధాత; చక్రవర్తి కాదగిన యభిమన్యుకుమారు రక్తముతో గూడ తడుపఁబడినదే. కేవలశత్రురక్తసిక్తమైన ప్రతీకారేచ్ఛవలన కొంత సంతసమేజనించును. ఈ యభిమన్యుమరణము వజ్రఘాతవలె దుర్భర మగుచున్నదే. ఈ రణభస్మముతోబాటు నా బుద్ధియు నెగిరిపోవుచున్నది. రక్తప్రవాహములో నేను కొట్టుకొనిపోవుచున్నాను. ఫేనబుద్బుదరహితమై దుఃఖసాగర మనంతమై కనఁబడుచున్నది. ఎట్లు దీని నీదుట? అంతయు శూన్యజగత్తే కనఁబడుచున్నది. హర్ష నినాదము వాయువులో నిస్సారమైలీనమగుచున్నది. మా తాత భీష్ముఁడు మహావీరుఁడు. అందఱి యాయువున స్వారిఁజేయు మృత్యువు చేతులుకట్టుకొని యతనియాజ్ఞ నౌదలఁదాల్చుచు నల్లంతదూరములో నిలబడియున్నది. కాని భీష్ముని ప్రకృతి యుపయోగించుకొనలేక గోల్పోయినది. వీరగతికి సుయోధనుఁడు పోయినాఁడు. అశేషజనము సర్వనాశనమైనది. నేనిప్పుడు ప్రపంచమునొక్క యెదుటకుఁజని జయమెవరిది? అని సవాలుజేసి యడిగిన సమాధాన మేమనివచ్చును? 'సుయోధనునిదే! సుయోధనునిదే!'

అనివచ్చును. ఈ రాజ్యాధికారపు తలపాగ ఈ దుఃఖాగ్ని జ్వాలలతో నేనా నాతలకుఁజుట్టుకొనునది? ఎవరీ మానవరక్తనదీతీరమున మృతబంధుప్రల యార్తనాదముల వినుచున్నారు? మేము. బంధుశవదహనముల నెవరు వీక్షించుచున్నారు? మేము. మహాభారత యుద్ధపరిణామమెవరు నుర్తై అుఁగుచున్నారు? మేము. అయ్యో! శరీరపశుబలమును విడిచి మనో బలముతో దెబ్బలాడిన నెట్లుండునది? తపము, సహనము, త్యాగము, మొదలగు సాధనముల ననహాయోద్యమము సాగించి దుర్యోధనునకు హృదయపరివర్తనముఁగావించి లోకకళ్యాణము నొసర్చిన ప్రపంచ చరిత్ర లో నేనొక క్రొత్తరికార్డును స్థాపించకపోవుదునా? నాహృదయ నైర్మ ల్యముతో దుర్యోధనుని హృదయమాలిన్యము కడుగజాలకపోవుదునా? నా హృదయకారుణ్యమునకు వజ్రిము కరుగకపోవునా? అటుల కాదేని రక్తపాతము కాకుండ సోదరులతో నా మరణాంతము బిచ్చమెత్తుకొని నైన జీవించి మరణింతునుగదా? ఏ ముహూర్తమున యుద్ధబీజము నాటఁబడినదో యప్పుడే యాదివ్యాస్త్ర మంతరించినది. భీముని గద, పార్థుని గాండీవము, కృష్ణునిసహాయము నాబుద్ధిని తారుమారు జేసినవి. రణమధ్యమున మా యర్జునుఁడును, నావలె మోహవిభ్రాంతుఁడుకాఁగ నా కృష్ణుఁడే యారిపోవునగ్నిలో నాజ్యముపోసి మండించి యట్లర్జునుని యుద్ధోన్మత్తుని జేసినాఁడు. ఈ ఘాత అభిమాన, అవమానములతో కూడి యందఱికిని నష్టముఁగల్గించినది. కృష్ణుఁడేమో యుద్ధము పాపము కాదంటాడు. పరితాపముతో నా తల, మనస్సు తగులబడి తిరిగిపోవు చున్నవి. ఆ తాత భీష్ముఁడును యుద్ధమునకే ప్రోత్సాహమిచ్చెను. ఇందలి యంతరార్థమేమో తెలియకున్నది. అటు సుయోధనాదులుఁ జచ్చిరి. ఇటు అభిమన్యాదులుఁజచ్చిరి. భగవద్గీత యేమిటో యుద్ధము చేయుమన్నది అంటారు. ఈ యుద్ధముల రక్తమున 'నపరిశుద్ధమగు జయమో, కంక, గృధ్ర, జంబుక, కబళీకృతమగు సర్వనాశనమో లభ్య మగుఁగాని యానందమెట్లు చేకూరఁగలదు? ఇపుడు లభించిన దశాంతిజన్య

సుఖమా? శాంతిజన్యసుఖమా? కురువంశరాజ్యకిరీటము మాత్రము నాకు సులభముగనే లభించినది. కాని యందగ్నిహోత్రమున్నదే? ఎట్లు ధరించుట ? మనస్సులోని కళంకము, దైన్యము, ఆవేదనము రాజ్యాభిషేకమున కడుగఁబడునా ? జయక్రూరసర్పము నన్ను కాటువేయుచున్నది. దానిని తట్టుకొనుటకు నాకు శక్తి లేకున్నది. శరీరమనములు వివశత్వముఁజెందుచున్నవి. రక్తప్రపంతిపంకజనితమగు నీరాజ్యసుఖకమలము నెటుల గ్రహింపఁగలను ? పుత్రవిహీనమాతల కరుణామయదైన్యఘోషనెటులచెవుల వినగలను ? పితృవిహీనబాలుర యార్తధ్వనుల కెట్లు మన మెరియకుండ నుండఁగలను? మాంగల్యవిరహితలును, సౌభాగ్యవిహీనలునైన పతులుపోయిన సతుల దూషణఘోషలనెట్లు పడగలను ? ఎటుల వీరిని కనులఁజూడగలను ? నేను వినుటకు జంకినను, చూచుటకు పరాఙ్ముఖుఁడనైనను ఆ గోలమాత్రమట్టహాసము చేయుచునేయున్నదే. అభిమన్యు దారుణహత్య నన్నునుతుణ ములికిపడఁజేయుచున్నదే. యుద్ధాగ్నిమండి యారినది. కాని హృదయశోకాగ్ని మండుచునేయున్నదే. ఈనా పాడుముఖము లోకమున కెట్లుచూపింతును ? ప్రజలందలు నన్ను హింసకుఁడు, నిర్దయుఁడు, అని యేమేమో పల్కుచు నిందింపకమానరు. జనులు నన్ను దూషించుటకుఁగల కారణములు నా ప్రతియణువున లేకపోలేదు. సాటి మానవుని జూచుటకు సిగ్గుఁజెంది కన్నులు తమంతతామే మూతఁబడుచున్నవి. మనస్సు కలతఁజెందుచున్నది. ఆత్మహత్య చేసికొందమన్న నది మహాపాతకము, కళంకము, అని తోచుచున్నది. ఒక్కపని చేయుదునుగాక. అదేదన ? పశుపక్ష్యాదులు కూడ చూడకుండ ఏ కొండగుహలోనో దాగుకొనెద. అచ్చట కళ్లుతెరచి యొక్కపటి కన్నీళ్ళు స్రవింపఁజేసెద. ధర్మరాజునని యెవరికిని తెలియనీయను. ఇట్టికృత్యములమాత్ర మీపాపము శమింపఁబడునా ? పడదు. ఆత్మసంతృప్తికలిగి దుఃఖము శాంతించునేమో. శిథిలహృదయము కూడుకొనునేమో. వినబడక వ్యంగ్యోక్తులు మనస్సునకు గ్రుచ్చుకొనవేమో,

అంతియకాని మరేమియు లాభముకనబడదు.అంతయుగాఢాంధకారము. గర్భనిర్భేదము. బ్రహ్మచర్యవ్రతదీక్షితుఁడు, ధర్మస్తంభము, బలస్థానము. పరమ విరాగియైన భీష్మునీభరతభూమిపొందియుఁబొందనట్లే యయినది. ధర్మమునుగురించి కిరీటమువర్జించి స్నేహమునకుఁబ్రాణముపిడిచిన భీష్ము నితో సమానుఁడగు పరాక్రమవంతుఁ డెవఁడున్నాఁడు ? అతఁడు మృత్యువునణఁగ ద్రొక్కిన మహాజీవి. అట్టి మాతాత ఱెక్కలువిఱిగిన పిట్టయై యంపశయ్యపై వీరజీవితము గడుపుచుండెను. ఇట్టి సమయము ననా నేను రాజ్యసుఖము లనుభవించుట ? ఇట్టి విషమపరిస్థితుల బలివివే కములలో నేదిశ్రేష్ఠము ? బ్రతిమాలుటా ? కత్తిఝళిపించుటా ? రుధి రాత్త విజయముపూజనీయమా? కరుణాత్త ఘాతపరాజయ సువలంబ్యమా? ఏది పునీతశిఖ ? రక్తాన్ననీరాజనముతో మూరణ దైవాతిక రక్త సిక్త దే హము పై టచెంగునఁ దుడుచుకొనుచు నెటులవచ్చుచున్నదో ! దానికేమి కాని సారాంశము నరహత్యాపాపమా ? పుణ్యమా ? పాపము. ఒక్కనరుని హత్యయే పాపమైన నీకోట్లకొలదినరులహత్య యెంతపాపము ? ఎంత పాపము ? ఎవఁడుదీనికి ఉత్తరవాది ? ఏమిటిదీనికి శిక్ష?

(కృష్ణుని ప్రవేశము)

కృష్ణు : ధర్మరాజుగారూ ! ఏమిటి చేయుచున్నారు ?

ధర్మ : ధర్మరాజుగారు ఏడ్చుచున్నారు.

కృష్ణు : ఎందులకు ?

ధర్మ : చేసినపనికి.

కృష్ణు : ఏమిటాపని ?

ధర్మ : తమరుచేయుమన్న పని.

కృష్ణు : ధర్మరాజా ! విచారింపకుము. నీవుకూడ నరులలో భాగ స్వామివి. నీవును నవతలకుఁబోయి మేలుకొనెదవు. మానవునిలో బయలు దేరు దుఃఖసాగరము లోతు చూచితివా ? లేదు. తుపానులో పడినావు. ధర్మరాజా ! తుపాను నెఱుఁగుదువా ? తుపానుచెట్లను పడగొట్టును.

కొంపలు కూల్చును, కొమ్మల విరచును. ఆకుల రాల్చును. ఆకుమరుంగు పిందెలనుకూడ క్రిందికి పడద్రొబ్బును. పక్షిగూడుల నేలపాలుఁజేయును. అందుండెడి దిక్కు లేని పిల్లలనుకూడ నాశనమొనర్చును. దానికి జాలి యనునది కనఁబడదు. ధర్మరాజా! ఆ తుపానును రమ్మని యెవరుపిల్చిరి? ఎవరు దానిని సృష్టించిరి. చెట్టునపుట్టినయగ్ని చెట్టునే నాశనముఁజేయును. కాని తుపాను సర్వనాశనముఁగావించును. తుపాను తరువాత మిగిలి యుండునవి? రాలిన ఆకులు, విఱిగినకొమ్మలు, ఊడినమొదళ్ళు. వన వైభవము క్షణములో శ్మశానమగును. ఒకప్పుడు చిగుళ్ళతో, పుష్పములతో, పండ్లతో, రామణీయకముగా కనబడినవనము తుపాను పిమ్మట భీభత్సముగ కనఁబడుటలేదా? ఆ యకాలదుమారమావనమును శ్మశానముఁ గావించుచున్నది. కరుణ, దైన్యము, నిర్వేదము మాత్రము మిగిలిపోవుచున్నవి. పాపము! జడవృక్షమున కదేమి తెలియును? ప్రకృతి అగ్నివాయువుల సమ్మర్దమున బద్ధలై ప్రళయ ఝుంఝామారుతము వీచును. భూమి బ్రద్దలగును. అట్లే ద్వేషాగ్ని, ఈర్ష్య, అసూయాది వాయు ప్రకోపములు విజృంభించి మానవుని క్షుద్రహృదయమున తపింపఁ బడి సామాజిక కాకాశమున వృద్ధినొంది యుద్ధరూపముగ తయారగు మన్నది. ధర్మరాజా! రక్తజలస్నానముతో నానంద బాష్పజలపాన మసంభవము. భిక్షు, సమత్వముల శాంతియున్నదని భ్రాంతిఁజెందు చున్నావు. సుధామయఫలమును గాంక్షించుచున్నావు. అనంతాకాశ ములనుండి యమృతస్రవంతిని దింపుటకుఁబ్రయత్నించుచున్నావు. స్వప్న జగత్తులో సచ్ఛాంతిని మేలుకొలుపుచున్నావు. కన్నీటితరంగముల రక్తపు బురదను గడుగఁజూచుచున్నావు. ప్రతీకారవాంఛగలవ్యక్తివధను జయము గనే భావించి యానందించును. నీపరిస్థితి బాగుకాదు. రాజ్యము నీకు కావలె. యుద్ధము జరుగకుండ ప్రతీకారము తీరవలె. ఇదెటుల సంభవము? ఈ భరతమాత ప్రతియవయవము కొట్టఁబడినది. త్రాహి త్రాహి నాదము బయలుదేరినది. ఆపత్తు ఘోరమైనది. స్త్రీపురుషులు మృత్యుఘాతచే

వికలురైరి. ఇట్టి వీరిని విడిచి యరణ్యమునకుఁబోయి యేమి శాంతి సాధించెదవు ? అమృతధారను త్రాగించుము. లతాగుల్మముల వికసింపఁ జేయుము. అశ్రుతాపమును హరించి యపహృతబంధువుల యధరములపై చిరునవ్వు తాండవింపనొనర్పుము. చచ్చినవారి యాశవీడి బ్రతికి యున్నవారి బాధ్యత వహింపుము. దుర్యోధనుఁడు చనిపోయెను. ఆభారము నీపైనఁబడినది. ఇఁక యీ భారమును సంబాళించు వారెవరు ? నీవే. పరప్రాణిని ప్రేరేపించి పుణ్యకిరణములలో నిలుపుము. ఇఁకముందైనను ప్రోగుచేసికో. ప్రోగుఁజేసికొన్నవాఁడు సంకటస్థితిలో బాధచెందఁడు. ఘోరభారవిపత్తు వానిపై విరుచుకొనిపడదు. భవిష్యత్తును గుఱించి మేలుకో. ఇప్పటినుంచియైన తయారుకమ్ము. నిజముగ మానవుఁడు ఎప్పటికప్పుడు పశ్చాత్తాపముతో కంగారుపడి మేల్కొనవలె. మేల్కొనుట యంటే ప్రజలకండ్లుకప్పి ధనముప్రోగుచేసికొనుటకు ప్రారంభించుట కాదు. ఎవరికివారే నొల్లుకొనుట కాదు. ఆత్మరక్షణకు వేఱగుటయు కాదు. లోభసర్పముచే కరువఁబడుటయు కాదు. సమిష్టిసమభావముల సుఖజీవితముకావలె. అటుల కానినాఁడు దొంగతనములు, దోపిడీలు బయలుదేరును. చేతనున్నదిచేతనే లాగికొనిపోవుట ధర్మసూత్రము తెగి మానవసమాజము ఛిన్నాభిన్నమగుట తటస్థించును. అపుడాకోలాహలసముద్రమున భూమి మునిగిపోవును. ఆ జగ దుపద్రవము మాన్పుటకు ఖడ్గము కావలసి వచ్చును. లోభసర్పము నడుపునం దుంచుటకా ఖడ్గమును ధరింపఁగల పరాక్రమవంతుఁడగు శాసకుఁడును నవసర మగును. అప్పుడు సాటి నరుఁడే దండధరుఁ డగుచున్నాఁడు. భయంకరమగు నరశరీరములో దనుజత్వము దాగుటచే సమిష్టివదలి తననుమాత్రము సుఖినిగాఁ జేసికొనుటకు వ్యష్టినడచును. గహనమైన దాసత్వగర్తలో నపుడు నరుఁడు తెలియకుండ నేపడును. నరులలోని సహజజాతిప్రేమ యూరక నరుని విడిచిపోదు. ఆ ప్రేమచేతనే నొకనికి మరియొకఁడు మోసముచేయుటకు సందేహించుకొనును. పాపమునకు జంకును. దాసుఁడగుట కంగీకరింపఁడు.

దండనీతి కులిశపాతమునకు లోబడఁడు. కాని స్వార్థ మధికమగుతఱి నా ప్రేమ స్వార్థమున లీనమైపోవును. అట్టివాఁడు నీతి, ధర్మములవలన సుఖభాగ మితరునకొసంగఁడు. అట్టితఱి వానిచే రాజదండ మిప్పించును. ప్రభు వెంతగ నవసరమో పండితుఁడును నంతగ నవసరము. పండితుని వాక్ఛక్తియు న్యాయసత్యముల నవహేళనచేయువారిని చల్లని మాటల నచ్చఁజెప్పి దోషాదోషములఁ దెలిసికొనులాగునఁ జేయును. స్వార్థపరత్వము కంటె మానవజాతికి పతనకారణము మఱేమున్నది? పతితమానవసమాజముకొఱకే ఖడ్గధారియగు ప్రభువు కావలసివచ్చెను. ప్రభువువలన నత్యాచారపరులైన దుర్మార్గులు భయపెట్టఁబడవలెను. అన్యోన్యసంఘర్షణలు జరుగకుండ ఖడ్గధారియగు ప్రభు వవసరమయ్యెను. దైవసంబంధమగు న్యాయ ధర్మములఁ దెలియఁ జేయుటకుఁగాను పండితుఁడవసరమయ్యెను. అవినీతినుండి తొలగించుటకు ప్రభువును, నీతిన్యాయపథముల నడిపించుటకు పండితుఁడును నవసరమైరి. కుత్సితసంస్కృతి మూలమున ప్రజాపతనావస్థకలుగును. దానికే రాజశాసనము కాని యున్ముక్తపురుష గుణనిరోధకమునకు, నట్టివాని స్వేచ్ఛ యరికట్టుటకును కాదు. ఐనను నితరములగు మంచియాలోచనలుకూడ రాచకీయములతోఁ గొట్టుకొనిపోవు మన్నవి. నేనుకాని విదురుఁడుకాని యట్టి రాజచట్టనియమమునకు లొంగిపోవలసివచ్చినది. రాజశాసనమునకు వ్యతిరేకములు తృణతుల్యములు. ఏనాబోటివానికోతప్ప సామాన్యులకు శాసనోల్లంఘన మొనర్చుటకు వీలుండదు. అందువలన క్రొత్తసవరణ యేర్పడదు. మెడకు దుస్తంత్రమనే జూయికట్టఁబడును. మనుజుఁడు జగమున తనరూపముమార్చి తిరుగ వలసియుండును. నరుఁడు తనమనస్సునే తన స్వాధీనములో నుంచుకొనఁ జాలఁడు. అందువలన నగౌరవముగ నిజజీవనముపై ఖడ్గధారియగు కావలావాఁడు కూర్చుండవలసివచ్చెను. ఇఁక కావలావాఁడు కదలనీయఁడు. మెదలనీయఁడు. వాఁడును స్వార్థపరుఁడైన మఱి చెప్పవలసినదిలేదు. ఇట్లు నరుఁడు లేకికర్మవల్లనే స్వయముగ ప్రభువును నిర్మించుకొని వాని

శాసనము నాదరింపవలసినవాఁడగుచున్నాఁడు. ఎప్పటివరకు మానవ స్వార్థపరత్వము సమూలముగ నాశనము కాదో అప్పటివరకు నరసమాజము నకు కావలావాఁడును దూరముఁ కాదు. నరుఁడు వికృతుఁడు. అందువలన ధర్మధ్వజధారి నరపతి కావలసియుండును. రాజతంత్రము హేయము. రాజధర్మము చాల భారమైనది. ధర్మరాజా! సన్యాసము వెదకికొనుట పిఱికితనము. సర్వ మానవ హితమునుంచి తన వ్యక్తిగత సుఖమును చూరగొనుట యేమంత దుర్లభము కాదు, కోట్లకొలది మానవుల సుఖ వంతులఁ జేయుట కష్టము. జగత్తునువిడిచి నీలోనే నీ వానందించుటకంటె నిన్ను నీవు సుఖవంతునిగాఁ జేసికొని నీ వివేకబలమున జగమును స్వర్గము నకుఁ జేర్పు. తపమువలన నిజసుఖమును బొందదలఁచుకొన్నావు. చేయ వలసిన దదికాదు. ప్రభువవై యనేకుల దుఃఖమును దూరముచేయుము. తన హితవును మాత్రముకోరి తపము చేయుట ధర్మమా? సమిష్టిమోక్ష దానము ధర్మమా? ఆలోచించు. నిన్ను నీవే చూచుకొనుట కాదు. యావ త్ప్రపంచమును జూడు. నీమాదిరిగనే శాంతిసుఖానుభవముల ప్రతి మను జుని నిరతునిగా జేయుము. అరణ్యములో శాంతిదొరుకునని నీయాశ. అచట నీ చరణచిహ్న ముద్ర పడుటతప్ప మఱేమియు లాభములేదు. దుఃఖశాంతికి నిర్జనవనము నాశ్రయించిన నక్కడ దుఃఖముకలిగిన మఱేమి శరణ్యము? రాజా! లోకము తగులబెట్టఁబడుచున్నది. నీ యాదర్శము లెవనికి కావలెను? భూమి శ్మశానమై దేనివలన జనులు భయపడుదురో యట్టి రాజభవనముకూడ పాడుపడియుండ వేఱే వనమేల? సన్యాసి త్రివిధతాపముల నరణ్యమున తపింపఁబడ వనమునుండి కమండలముతో మఱెక్కడకు పరువెత్తును? సుఖమునకు వనపురభేదము లేల? ప్రాప్తిని కోరువాఁడు ప్రాప్తిని పోగొట్టుకొనుట కిష్టపడనివాఁడు జయాపజయ ములఁగూర్చి మోదఖేదములనెన్నడును బొందఁడు. అచ్చులు మాత్రము వేఱైనను ప్రతిజీవి జీవితము నొకమూసలో కుదింపఁబడియుండును. అరణ్యావృతముల నటికి తనకుమాత్రము దారిచేసికొనువాని జీవితమొక-

జీవితముకాదు. ప్రకృతినిగూర్చి భయపడక పాదముల సమముగనిల్పి కష్టములకెదుఱొడ్డి యెవఁడు దెబ్బలాడునో వానిది జీవితము. సముద్రము లవణయుక్తకటుజలముతో నందఱికిని వెగటుఁగల్గించుచున్నది. మందర పర్వతమందు పడవైచి యెవఁడు మథించెనో వానికిమాత్ర మాలవణ జలధి యమృతమిచ్చినది. అమృతఫలముకోరినవాఁడే యట్లుమథించి రస పీయూషము త్రాగుచున్నాఁడు. అట్టి ధైర్యముత్సాహములేనివానికి మందర పర్వతమెందులకు ? మథించుటెందులకు ? అనుభవమునకు వస్తువేది ? సన్యాసి యుపయుక్తమగు జీవితము లవణసముద్రమని వదలివేయు చున్నాఁడు. అమృతసముద్రి మణిరత్నకోశమునుండి పృష్ఠమును త్రిప్పిన నతఁడేమిలాభమును గాంచఁగలుగును ? ధర్మరాజా ! ప్రజలహక్కులకు భంగ పాటువాటిల్లకుండ ప్రజారాజ్యమును స్థాపింపుము. లెమ్ము.

ధర్మ : ఇంతకంటె వేఱుమార్గ మేమున్నది ? మాధవా ! దుఃఖ శాంతికై నీమార్గ మవలంబించెద. జైహింద్ ! (తెరపడును)

చతుర్థాంకము. సమాప్తము.

## పంచమాంకము (ధర్మరాజ పట్టాభిషేకము)

ప్రథమ దృశ్యము. స్థలము : రాజదర్బారు

(పట్టాభిషేకపు టేర్పాటులతో) ధర్మరాజు సింహాసనముపై, భీమార్జునులు వింజా మరలవేయుచు, నకులసహదేవులు పాదపీఠముచెంతను, ద్రౌపది వెనుకభాగమునను, వ్యాసధౌమ్యాదులు యాశీర్వదించుచునుండ శ్రీకృష్ణుఁడు పై యేర్పాటులు చేయువానిగఁబ్రవేశింతురు.)

## భరతవాక్యము

గీ॥ స్వస్తియౌఁగాక ప్రజలకుఁ బ్రభువులెపుడు
న్యాయమార్గంబునను బాల నంబుఁజేయు
చుండుత్రిగాక సాధువులకు శుభముఁకల్గఁ
గాక, జగము సుఖించుమగాక సతము॥

సర్వేజనాస్సుఖినోభవంతు.

